# ఇందు వచ్చు పాత్రలు

## పురుషులు, స్త్రీలు.



1. సూత్రధారుఁడు.
2. నటుఁడు.
3. రామభద్రుఁడు.
4. కంచుకి.
5. అష్టావక్రుఁడు.
6. లక్ష్మణుఁడు.
7. ప్రతీహారి.
8. దుర్ముఖుఁడు.
9. దివ్యపురుషుఁడు.
10. శంబూకుఁడు.
11. [illegible]ఘాతకి.
12. భాండాయనుఁడు.
13. జనకుఁడు.
14. లవుఁడు.
15. బ్రహ్మచారులు.
16. వటులు.
17. పురుషుఁడు.
18. చంద్రకేతుఁడు.
19. సుమంత్రుఁడు.
20. విద్యాధరుఁడు.
21. కుశుఁడు.
22. వాల్మీకి.
23. సృష్టి.

1. సీత.
2. తాపసి.
3. వనదేవత.
4. ఆత్రేయి.
5. వాసంతి.
6. తమస.
7. మురళ.
8. అరుంధతి.
9. కౌసల్య.
10. విద్యాధరి.
11. సరణి.
12. భాగీరథి.

[illegible] ముద్రాక్షరశాల. నెల్లూరు.

# విజ్ఞాపనము.

:0:

రసజ్ఞులారా! భవభూతిమహాకవి పదవాక్యప్రమాణజ్ఞుండనియు, బహుశబ్దవేదియనియు లోకంబున సుప్రసిద్ధమగు బిరుదంబుల నందియుండెను. కావున నేయుత్తరరామచరిత్రయం దేశ్లోకమును బట్టి చూచినను తేనెపట్టు నందలి గదులవలె శబ్దజాలము సాంద్రతరంబుగ నిమిడియుండును. ఇట్లనుటచే వాక్యాడంబరమేకాని భావగాంభీర్యాదిసౌష్ఠవంబులు లేవని తలంపఁజనదు. అవియు గ్రంథమునందెల్లెడఁ బూర్తిగ నిండియున్నవి. కరుణరసము ప్రధానముగఁ గైకొనియు శృంగార రౌద్రాదిక రసంబుల నుచితస్థానంబులఁ బొందుపరచియుండె. ఇందు హృదయమును గరంచు భావము లనేకములు గలవు. ఉపమాసౌష్ఠవము నపూర్వము. ఇట్టి రసవత్తరంబులగు భావములను సహజనిపుణత గలవాఁడగుటచే పదగుంభనంబునం బొందుపఱచె.

మహాకవి కాళిదాసునకును భవభూతిమహాకవికిని గల భేదమిచ్చట నే దెలిసికొనఁ దగియున్నది. కాళిదాసు భావగాంభీర్యంబునను, ఉపమాచమత్కృతియందును, మిన్న యని గొన్నఁబడుచుండియుఁ దత్తద్భావాదులఁ బ్రస్ఫుటముగా వెల్లడించుటయే ప్రధానముగా గమనించెను గాని పాండిత్యప్రకర్షను వెల్లడిచేయుటకై శబ్దాడంబరమును దన నాటకములయందుఁ గనుపరచియుండలేదు. పాఠకులందఱికి నీ విషయము స్వానుభవమే.

ఉత్తరరామచరిత్రము నాంధ్రీకరించుటలో నీ విషయమునే గమనింపవలసి వచ్చినది. సౌష్ఠవపదభూయిష్ఠంబయిన భవభూతిశ్లోకసంతతి నాంధ్రంబునఁ గూడనట్లే పదగాంభీర్యమున నెలకొల్పిననే గాని భవభూతియొక్క గౌరవాతిశయములను వెల్లడించుటకు వీలుండదు. తేలికపదములతో నాకూర్పు నాంధ్రీకరించుట కేవలమసంభవము. అట్లు చేయఁదలంచిన వ్యాఖ్యానతుల్యముగ గద్యరూపముననే యుంచవలయుం గాని ఛందోబద్ధము చేయనలవుపడదు. కావుననే నా యాంధ్రీకరణమునందీ ఫక్కి నవలంబించితిని. ఈయది కొందఱికిఁ గఠినముగా నున్నదని తోఁచవచ్చును. కాని భవభూతి రచనారహస్యము నెఱింగినవారు నెవ్వరు నట్లు తలంపరు.

ఈకవిద్వయమునందలి పూర్వోదాహృత తారతమ్యమును లోకమునకు వెల్లడించు తలఁపు నాకుఁ గలుగుటచేత నీయుత్తరరామచరిత్రాంధ్రీకరణము ముగిసిన వెనుక శాకుంతలమునుగూడ నిదివఱకే పెక్కండ్రు మహామహులాంధ్రీకరించియుండినను దానినే మఱల స్పృశించి నావాక్కును బవిత్రపరచుకొని యీ కవిద్వయగ్రంథ రచనా చాకచక్యము నేకముఖమున వెల్లడింప నిశ్చయించితిని. శాకుంతలాంధ్రీకరణమును గొంతవఱకు సాగుచున్నది. మా సద్వ్యయంబున గ్రంథము ముద్రింపఁబడి వెలువడఁగలదు. అందలి పద్యములు బహుమార్దవములై యెల్లరకు సుబోధంబులుగ నుండును. దీనిని జదివినవారలందఱును దానినిఁ గూడఁ జదివి చూచిన నా మనోరథము ఫలించును.

పెక్కండ్రు మహాకవులిదివఱకే జయప్రదముగ నాంధ్రీకరించిన శాకుంతలమును దిరిగి నే నాంధ్రీకరించుట వ్యర్థప్రయత్నమని తలంపఁజనదు. ఏలయన:—కాళి

దానునంతటి మహాకవిచే రచియింపఁబడిన శాకుంతలమువంటి యుద్గ్రంథము, ఆంధ్రీకరణమునకు మఱియొకటిలభింపదుగదా! రామకథాసుధారసమును బెక్కుమాఱులు తనివితీరఁగ్రోలినను యింకనెందఱికైనఁ దృప్తినీయఁగలదియై యుండునుగాని కొఱవడదు గదా! కావున నోరసజ్ఞులారా! ఇదివఱకుఁ బెద్దలచేఁ జేయఁబడిన యాంధ్రీకరణములఁజూచి యుంటిమిగాన దీనినిగూడ నేలచదువవలయునని విసువుఁజెందక దయచేసి నా గ్రంథమునుగూడఁ గొంచెము శ్రద్ధతోఁ బరికించి యితరాంధ్రీకరణములతోఁ బోల్చిచూచి యేకొంచెమునందయిన నించుకరసము గాన్పించిన మీరానందించి తన్మాత్రమున నన్నాదరింపఁగోరుచున్నాఁడను.

ఉత్తరరామచరిత్రమునందు నాయకుఁడగు శ్రీరాముని చర్య భవభూతిచే సరిగా సమర్థింపఁబడలేదని కొందఱాక్షేపించుచున్నారు. శ్రీరాముండు, అగ్నిపరిశుద్ధిం గావించియు సీతాపరిగ్రహణమును జేసియుండియు జారునిచేఁ దేఁబడిన కింవదంతిని పురస్కరించుకొని తనమనంబున సీతాపాతివ్రత్య విషయమున నించుకంతయు సంశయము లేనివాఁడయ్యు సీతాపరిత్యాగమును జేయుట సత్పురుషలక్షణము కాదనియు, కింవదంతిని బ్రబలమగు హేతువుగ గ్రహించుటయు నసమంజసమనియు, శాకుంతలమున దుష్యంతుఁడు శకుంతలాపరిత్యాగమును జేసినను గాళిదాసు దుర్వాసశ్శాపమను ప్రబలకారణము ననుసంధించి దుష్యంతుని యోగ్యతకు భంగము కలుగకుండఁ గాపాడెననియు నిందు భవభూతియట్టికారణమును గల్పింప నేరకుండుటయొకలోపమనియుఁ జెప్పెదరు.

ఉత్తరరామచరిత్రమున నట్టియుక్తియుక్తమగు హేతుకల్పనము లేకపోలేదు. నాటకమంతయుఁ జక్కఁగాఁ జదివిన యుక్తమగు హేతువుకలదని పాఠకులకే విశదము. ఈనాటకమునకంతకును సీతాపరిత్యాగమే ప్రధానాంగమైయున్నది. రాముని యందట్టినిందను మాపుటయు, అందులకుయుక్తియుక్తములగు సమాధానములను జెప్పి జయప్రదముగ రాముని యోగ్యతను నిలువఁబెట్టుటకై సప్తమాంకమున, "గీ. తడవ రాక్షసమధ్యవర్తనమొకండు" అను నాల్గవపద్యము మొదలుకొని 7 వ పద్యాంతము వఱకును చక్కఁగ వ్రాయఁబడియున్నది. లోకారాధనవ్రతమే రామునకీవిషయమునఁ బట్టుకొమ్మయైయున్నది. వసిష్ఠుఁడుగూడ నట్లే రామున కాలోచనముఁ జెప్పియుండెను. ప్రథమాంకమందు "గీ. మము నిరోధించె" అను పన్నెండవ పద్యముం జూడుఁడు. అట్టియాలోచనము కర్తవ్యమని రాముడప్పుడే స్థిరపఱచుకొనియుండెను. (1 అం 13 ప) అందు "జనకసుతనైన" అనియుంగూడఁ జెప్పియుండెను. ఈ విషయమునే (1 అం. 42 ప.) "శిష్టులకు నెట్టికృత్యంబు చేతనైన, జనుల యిష్టానుసరణంబు సద్వ్రతంబు" అను పద్యమున దృఢపరచుకొనియెను. ఆక్రిందిపద్యమునఁ దనవలన "కశ్మలంబొదవదు" పలుకలుగవలయునని వితర్కించుకొనియె. (1 అం 43 ప.) అగ్నిశుద్ధియందుఁ బ్రజలు నమ్మకముంచకపోవుట వారి కుచితమేయను భావమును (1 అం. 45 పద్యమున) రాముఁడే సూచించియున్నాఁడు. రాముని కాలమున మహాత్ములుగా నెన్నఁబడు మహర్షులెవ్వరు నీసందర్భమున రాము

నియందు దోషారోపణ చేసియుండలేదు. అట్టి భావమును మనస్సునందిడికొనియే భవభూతి మహాకవి నాటకమునందెల్లెడల రాముని బోషించెను. ఇందు రాముఁడవలంబించిన నైతికాధిక్యతను జనసామాన్యము గ్రహింపకుండుట యొక యాశ్చర్యములోనిదికాదు. వనదేవతయగు వాసంతికగూడ మహాత్ముల చిత్తంబులఁ దెలియశక్యంబుగాదని (2 అం. 6 ప.) చెప్పియున్నది. వాసంతిక నీవు సీతనేలవిడిచితివని రాముని ప్రశ్నింప "లోకము సహింపదని" దని రాముఁడు ప్రత్యుత్తరమొసంగె. ఈవిషయమునే పౌరజానపదులనుగూర్చి రాముఁడు (3 అం. 32 పద్యమున) జెప్పియుండెను. సీతకు జననీజనకులగు పృథ్వీజనకులకంటె రామునినిందింపఁదగినవారు తదితరులుగారు. జనకుఁడు పుత్త్రీవియోగ జనితమగు 'దుఃఖమున్మత్తునగుటచే నీషద్విషాదమును వెల్లడించియుఁ బశ్చాత్తాపమున రాముఁడు తనకు విధివిహితమగు కర్మనే యాచరించెనని తెలిసికొని ప్రశాంతమనండెను. (4 అం. 24-25 ప) స్పష్టీయున్నట్లే ప్రశాంతయయ్యె. (7 అం. 7 ప.) ఏడవయంకమున నరుంధతీదేవి యంతర్నాటికయందు సమావేశమయిన చరాచరభూతకోటికి సీతాదేవి నిష్కళంక సౌశీల్యత వెల్లడించి వారి యామోదమును వడయునంతవఱకుఁ గౌసల్యాజనకుఁడు మున్నగు స్వజనముగాని, వసిష్ఠాదిమహర్షులుగాని, సీతను తిరిగి స్వీకరించవలసినదని రామునకుఁ బ్రబోధింపఁజాలరైరి. (108 పేజీ మొదలు 19 వ పద్యము చివరవఱకు) "శ్లో॥ ఏతేనవృద్ధిరే వీరాబ్రహ్మక్షేమాయదీక్షితాః । లోకానంద ముకుందస్య సత్యావ్రత ఇవ బాహవః॥" అని భోజచంపువునఁగూడ వ్రాయఁబడియున్నది. లోకమున మూఁడువిధములగు ధర్మములు గలవు.

1. నరుఁడు నరునివిషయమున గమనింపవలసిన ధర్మములు.
2. పరిపాలకుఁడు పరిపాల్యుల విషయమున గమనింపవలసిన ధర్మములు.
3. సృష్టికర్త సృష్టివిషయమున గమనింపవలసిన ధర్మములు.

ఇందు రాముఁడు తనయవతార జ్ఞానము రామావతారమున గుర్తింపకున్నను నాతనిచర్యలు పయిమూఁడవ విధానముఁగల ధర్మములై పరిణమించెను. కావున సీతాపరిత్యాగమున రాముఁడకార్యకరణ మొనర్చెననిగాని భవభూతికాళిదాసు వలెఁ దగు నుపపత్తిని గలిగింప లేకపోయెనని గాని తలంచుట యసమంజసమని విన్నవించుచున్నాఁడను. శకుంతలా పరిత్యాగమునకు దుర్వాసశాపమెట్టిబలవత్తర మయిన యుపపత్తియో, సీతాపరిత్యాగమున లోకారాధనయునట్టి యుపపత్తియేయనిగూడ విన్నవింప సాహసించుచుంటిని.

ఈయాంధ్రీకరణమును జేయుచుండిన కాలముననే మనదక్షిణదేశమునందెల్లెడల నుత్కృష్టపండిత శిఖామణులుగా భావింపఁబడుచున్న సుప్రసిద్ధానేకోద్గ్రంథ రచనాధురీణులగు బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయశాస్త్రులువారినీవిషయమునఁ బృచ్ఛసేయఁగా వారును నేను పయినవ్రాసినట్లే చెప్పియుండుటచే నీవిషయమున నిది సిద్ధమని నేనును నిశ్చయించుకొని తదభిప్రాయమును వెల్లడింప సాహసించితిని.

ఇట్లు విన్నవించు విధేయుఁడు,

రాజా. యమ్. భుజంగరావు.

# PREFACE.

This play is the work of the celebrated Dramatist Bhavabhuti, who according to tradition was a contemporary of Kalidas, the Shakespeare of India. They flourished in the time of King Bhoja who himself was a poet of a very high order of excellence along with seven other illustrious men of genius, known as the 'Nine Gems'. Though there is no regular history giving details of the lives of these great poets, a perusal of the Sanskrit literature in our country will afford ample evidence as to the truth of these facts.

The work is very popular among Sanskrit Scholars & is very carefully studied for the sake of its excellent diction Ever since the time when the art of printing became known in India, several editions of the original Sanskrit work were published and there are no less than 6 or 7 translations of the play in the Telugu language alone.

The hero of the Drama Sree Ramachandra is worshipped by the Hindus as an Incornation of the diety Sree Mahavishnu He is also the hero of the great Epic poem Ramayana. Sree Rama is the son of Dasaradha, the King of Oudh. He had three brothers, Bharatha, Lakshmana & Satrigna. He married Sita, the adopted daughter of Janaka, King of Midhila. He had to go into exile for a period of 14 years with his wife and Lakshmana by the command of his father who was goaded on to it by his second wife Kaikeyi. Ravana the king of Lanka (Ceylon) who is represented as a ten-headed demon, abducted Sita during Rama's absence & kept her in his garden under the custody of some of his female servants who were

instructed to win her affections for him either by threats or persuasions. Rama in the meantime searched for Sita & rescued her from Ravana after killing him and his people. Thus the very purpose of Rama's incornation was accomplished. He then went to his kingdom & became king in his father's place.

Sometime afterwards Rama exiled his wife while she was pregnant on account of the serious doubts entertained by his subjects as to her chastity. The subject of the present work begins at this point. Sita gave birth to two male children, Kusa & Lava in the waters of the river Ganges into which she fell in order to put an end to her miserable existence as a discarded wife. She was taken care of by her mother Goddess Earth and her two children were placed under the tutorship of sage Valmiki, where they learnt all the sciences. Rama in the meantime with a view to perform the horse sacrifice left the sacrificial horse on the wide world by way of challenge that he who arrests its progress will be conquered by him. A big army commanded by Chendraketu, Lakshmana's son, followed the horse to guard it. Lava the second son of Sita, stopped the horse and defeated Rama's army and was having a single combat with Chendraketu, when Rama who happened to pass by that way compromised the matter between them. Rama & Lava began to love each other. At this stage Valmiki with other sages and Goddesses gathered a big meeting of Rama's subjects and declared before them that Sita was both innocent and chaste They then united Sita with Rama and the people greeted them at their re-union. Thus ends the drama.

The play consists of 7 acts. The poet in the first act, briefly recalls the incidents in the previous life of the hero by a reference to the scenes from the sylvan life led by him with the heroine, exhibited in a picture gallery attached to the palace. He then sends Sita who is pregnant into exile under the pretext of ministering to her desire, to enjoy life in the hermitages once more.

The poet then shifts the scene to the Dandaka forest, where our hero spent nearly 12 years of his exile in Act 2. He had to go there to punish Sambuka, a Sudra by birth, performing penance, which a Brahmin alone is entitled to do.

The hero gives went to his pent up sorrow at the injustice done to his wife when he saw the old familiar places, where he enjoyed unbridled happiness with her. The sentiments here expressed are very beautiful and sacred. This forms the subject matter of the 3rd Act.

The scene then shifts to the hermitage of the Sage Valmiki in Acts 4, 5. 6 & 7 where Rama's mother and his father-in-law meet the boys Kusa and Lava. Then follows the fight between Lava & Chendraketu where the poet beautifully describes battles as they used to be then conducted.

The poet very skilfully introduces a drama within the drama, where the several phases in the life of Sita after her exile, are exhibited for the edification of Rama & others. This is a device adopted by Valmiki to bring about the re-union between Rama and Sita and the other bereaved parties.

*Rajah M. Bhujanga Row.*



రాజా యం. భుజంగరావు బహద్దరు జమీందారు.

# ఉపోద్ఘాతము

:o:

శా. ఈసా యన్నను మహమ్మదీయులును, సర్వేశా యటంచార్యులున్
యేసంచుం దగఁ గ్రైస్తవుల్, గొలుతురో యేస్వామి నత్యంతమున్
దాసోహమ్మని వానికే సెరగెదం ద్రైగుణ్యాపూర్ణ స్నిధి
ధ్యాసం దచ్చరణారవిందములపైఁ దధ్యంబుగా నిల్పుచున్.

సీ. లలిత నాటక రసా లంకార సాహితీగ్రంథపాఠకు లయ్యగారివారు
నిత్యవైదికకృత్య నిష్ఠాగరిష్ఠతా ఖ్యాతవర్తను లయ్యగారివారు
సకలలౌకికకార్య సంధానచాతురీ కలితకోవిదు లయ్యగారివారు
జగపతిరాజ సంస్థానార్జితాఖండ ధారుణీవిభు లయ్యగారివారు

గీ. అనఘలక్షణ లక్షితు లైనయట్టి
వారి వంశంబు నందుసర్వప్రకార
ములను గూటస్థపురుషుల పోల్కిఁ గనుచు
సలలితుఁడుమామహేశ్వర శాస్త్రివెలయు.

ఉ. ఆతనికిం బ్రియాత్మజుఁ డనంతగుణాంచితుఁ డాంధ్రహూణభా
షాతతసాహితీ పటురసజ్ఞుఁడు నాకును నోడియల్లుఁడుం
బ్రీతి మెయిన్మనంబొసఁగు మిత్రుఁడు నైతగు వీరభద్రరా
వేతదుదార బంధుజన వీక్షణ తత్పర మానసంబునన్.

ఉ. మాపురికేగుదెంచి యొకమాసము మద్గృహమందు వేడుకల్
దోపవసించి మత్కృతకృతుల్ దిలకించుచు నొక్కనాఁడు వి
ద్యాపటిమం గురించి హృదయంబు కుతూహల వార్ధిఁదేలఁగాం
శ్లాపరతంత్రతం బ్రియవచస్సరణి న్వచియించె నీగతిన్.

సీ. చారుమతీ, హరిశ్చంద్ర, కృష్ణా, జ్ఞాతవాసాది సర సరూపక చయంబు
శివపురాణము, సుశీల, వసంతకుసుమంబు, వారకాంతాది ప్రబంధములును
రాజహంసయు, మనోరమ, విజయాంకసాహస, నైషధాది గద్యాత్మకములు
మనుపవిహార, సర్వమంగళా, గోఖలేచరిత, మార్కండేయశతకములును

గీ. ప్రహసనంబులు, స్తోత్రతారావళులును । చిత్రయుక్తులఁదెల్పు చరిత్రములును
అతుల గీతప్రబంధంబు లాదిగల్గు । కృతులు రచియించితీవు పండితులు వొగడ.

సీ. ఇలశుద్ధమా బెతిల్‌హేము పట్టనమునఁ గన్యయౌ మరియాంబ గర్భమందు
జననంబునొంది పావనసువార్తలశిష్యవరులచే జగమునఁ బ్రబలఁజేసి
స్పర్శమాత్రమున సర్వవ్యాధు లణఁగించి జనులకారోగ్యంబు సంఘటించి
ఖలజనులొనరించు కడగండ్లను సహించి మదిలోన వారి క్షేమంబుఁ గోరి

గీ. ప్రజల దురితంబు లణఁగింప నిజశరీర । మును సిలువకర్పణముజేసి ఘనతతోడ
ఛాత్రులకు దివ్యరూప దర్శనమొసంగి । నట్టిదేవుని చారిత్ర మభిలషించి.

వ. సురుచిర గద్యపద్యమయ శోభిత సూక్తుల తోడఁ బండితో
త్కరములు జూచి మెచ్చ సముదార తరంబగు సత్యవేదముం
బరువడి నాంధ్రభాషను బ్రబంధముగా రచియించి తన్మతా
దరులకు శ్రోత్రపర్వము సదా ఘటియించితి వోసుధీమణీ !

చ. వివిధము లౌ ప్రబంధములు విస్తరిలం బొనరింప నయ్యెఁ బా
ర్థివవర ! సంస్కృతంబగుకృతిం దెనుఁగింపఁగలేదొకండు నీ
కవితకు వన్నెయల్గలుగు కైవడి నుత్తరరామనాటకం
బవిరళ మాధురీ మహిమ నాంధ్ర మొనర్చి కొఱంతఁ దీర్చుమా !

చ. పురహరుఁగొల్చి సంపదలఁబొందుటచే భవభూతినాఁగ ను
ర్వర బిరుదంబుఁజెంది కవివర్గశిఖామణి కాళిదాసుచే
స్థిరతర కీర్తివైభవము చేకుర సన్నుతిఁగాంచు నమ్మహా
త్తర వరనీలకంఠ కవితల్లజుఁ డాకృతికన్యకంగనెన్.

చ. అని ప్రియమిత్రుఁడై పలుకు నాతనివాక్యము లాలకించి మ
న్మనమున నట్టి సాహసమొనర్పఁగ సంశయమొంది యైన నా
తని యభిలాషఁ దీర్పఁ బ్రమదంబున దీనికిఁబూనినాఁడ, నం
దనిఫలమున్ గ్రహింపఁగ గణంగుచు నఱ్ఱులు సాచుపోలికన్.

సీ. పదగుంభనం బన్న ప్రస్ఫురద్రత్నంబు లేర్చి మాలిక నొనగూర్చినట్లు
అమితార్థ సారస్య మన్న మల్లెలు మొల్ల లెల్లఁదావుల వెదజల్లినట్లు
అలభావగాంభీర్య మన సుధారసధార లంచితాబ్దములు వర్షించినట్లు
అతుల రసౌచిత్య మన హాళాద్ఘటిత విద్యుచ్ఛటాస్ఫుటదీప్తు లొలసినట్లు

గీ. మానితానూనవైభవోత్తాన మైన । యట్టి భవభూతి కృతిరత్న మాంధ్రశైలి
ననుగమింపఁగఁ గల్గుదునా యటంచు । సంశయం బయ్యె భార మీశ్వరుని దింక.

చ. చదువరులార! నాకుఁ గల శక్తికొలంది రచించినాఁడ ని
య్యది భవదీయ మానసములందు రుచించునొ? లేదొ? నాదు నె
మ్మది నెఱుఁగింగఁజాల ననుమానము లున్న నణంచి, యున్న మొ
ప్పిదములె గొప్పగాఁ దలఁచి ప్రీతి వహింపుఁ డనుగ్రహంబునన్.

ఇట్లు

కవిపండితవిధేయుఁడు,
రాజా మంత్రిప్రెగడ భుజంగరావు.

ఏలూరు.
1—5—1918.





శ్రీ రస్తు.

జగదీశ్వరసహాయోస్తు.

# ఆంధ్రీకృతోత్తరరామచరిత్రము

## ప్రథమాంకము.

### నాంది—ప్రస్తావన.

---

క. మొదలిటి కవిరాజులకై
యిదియె నమోవాక మిచ్చ నెంచెద, నల శా
రద దివ్యామృతరూపన్
విదితాత్మ కలం దలంచి వినతి యొనర్తున్. 1.

(నాంద్యంతమున.)

సూత్ర—అతివిస్తరమేల? ఇపుడు భగవంతుఁ డగు కాలప్రియానాథుని మహోత్సవంబునందలి యార్యమిశ్రులం గూర్చి విన్నవించుచుంటిని. పూజ్యులగు మీరిట్లెఱుంగుదురుగాక! కలఁడుగదా కశ్యపగోత్రసంభవుండును, శ్రీకంఠనామలాంఛితుండును, బద వాక్య ప్రమాణ సారజ్ఞుండును, జాతూకర్ణీ పుత్త్రుండు నగు భవభూతి యను మహాత్ముండు!

గీ. భారతీదేవి తనుదాన వశ్యయగుచు
మించి యేబ్రహ్మ ముఖ మాశ్రయించె నట్టి
ఘనుని కృతిరత్నమును బ్రదర్శన మొనర్తుఁ
బ్రీతి నుత్తరరామ చరిత్ర మిపుడు. 2.

[ఆకసమువంకఁ జెవి యొగ్గి వినుట నభినయించి]

ఇక్కాలంబున గీర్వాణభాషాపరిచార మత్యల్పం బగుటచేఁ బ్రేక్షకుల కగ్రాహ్యం బని పలుకుచుంటివా ?

---

నమోవాకము = నమస్కారవాక్యము. విదితాత్మ = పరమాత్మాంశ భూతమగు బ్రహ్మ = బ్రహ్మదేవుఁడు, బ్రాహ్మణుఁడు.

మ. వర మంత్రిప్రవరాన్వయోజ్జ్వలుఁడు విద్వద్బృంద సంసేవనా
వరణాయత్తమనస్కుఁడున్, ఘనజగద్రాజఖ్యాతనామాంకుఁడుం
గరి ధాత్రీ నిధి చంద్ర సంఖ్యఁ (1918) దగు రంగత్క్రైస్తవాబ్దంబునన్
న్నిరతిన్ దీని రచించె నాంగ్రీగుణవర్ణ్యపుంగ నేలూరునన్ 3.

ఏతదాంధ్రీకరణమునే ప్రదర్శింపఁ బూనితిని. నేను కార్యవశంబున నయోధ్యా నగరస్థుండను రామసమకాలికుఁడను నైయుంటిని. (అంతటఁగలయఁజూచి) ఓహో! పౌలస్త్య కుల ధూమకేతుండును, మహాత్ముండునగు శ్రీరామసార్వభౌముని పట్టాభిషేక సమయం బహర్నిశంబవిచ్ఛిన్న గీత వాదిత్రంబై ప్రవర్తిల్లుచుండ నిప్పు డేలొకో చత్వరసీమ లెల్లఁ గలకలవ్యాపారములు లేక నిశ్శబ్దంబులై యున్నయవి!

నటుఁడు——(ప్రవేశించి) బావా! మహారాజు లంకాసంగ్రామ మిత్రులగు మహాత్ములఁ బ్లవంగ రాక్షసులను, నానాదిగంత సంశోభకులైన పూజార్హుల బ్రహ్మర్షి రాజర్షులను స్వగృహంబులం జేరఁ బనిచె. వారినారాధించుటకుఁ గదా యిన్నిదినంబులు వేడుకయైనది! ఇప్పుడో?

గీ. అల వసిష్ఠుని యాజమాన్యంబునన
రుంధతీ పురస్కృత సౌఖ్య బంధుర మఖ
సవనమును జూడ శ్రీరామజనను లల్లు
నాశ్రమస్థానమున కిప్పు డరిగినారు. 4.

సూత్ర——విదేశియైయుంటఁ గాన నడుగుచుంటిని. అల్లుఁ డెవ్వరు?

నటు—— క. శాంతయను కన్యకను భూ
కాంతుం డగు దశరథుండు గని యాబాలన్
సంతానంబుగ నొసఁగెను
సంతసమున రోమపాద జననాథునకున్. 5.

విభండకపుత్రుఁడైన ఋష్యశృంగమహాముని యాకన్నియం బరిణయంబయ్యె. ఆతఁడు ద్వాదశవర్షావసానంబైన సవనంబు నారంభింపఁ దత్కారణంబునం బరిపూర్ణగర్భ యగు కోడలిం జానకిని విడిచి గురుజనం బప్పటికిఁ జనియె.

---

కరి=అష్టదిగ్గజములు 8. ధాత్రి=భూమి 1. నిధి=నవనిధులు, 9. చంద్రుఁడు=1 సింహావలోకనమున 1918, అగును. వర్ణ్యపుంగ=స్తోత్రపాత్రముగ.

సూత్ర — మనకిదియేల ? స్వజాతిధర్మమున రాజద్వారమునే సేవింతమురమ్ము.

నటు — అట్లయిన భావా ! నిరవద్యంబైన రాజసేవాస్తవ క్రమంబు నిరూపింపుము.

సూత్ర — మారిషా !

గీ. ఎల్లతెఱఁగుల వచియింపఁ జెల్లుఁ గాని
దోషరాహిత్య మనఁగ నెందులకు నలయు ?
కలుషులం దెట్టులో పలుకులనసైఁ
దుర్జనుఁడె యగు జనుఁడు సానుత్వమూఁదు. 6.

నటు — అతిదుర్జనుఁ డని చెప్ప నొప్పు.

గీ. జానకీదేవి యెడలనే జనులు నింద
మోపిరింతకుఁ బరికింప నెంతల ముక్క
దైత్యమందిరవాసంబు దానికగ్ని
శుద్ధి యైనను నిశ్చయ స్ఫూర్తిలేగు. 7.

సూత్ర — ఈ కింవదంతి మహారాజు వీనులం బడెనేని దానఁ దప్పక ముప్పు వాటిల్లు.

నటు — సర్వవిధంబులం దపోధనులును బృందారకులును శ్రేయంబొసంగఁ గలరు.
(పరిక్రమించి) ఓహో ! మహారాజిప్పు డెక్కడ ? (విని) లోకు లిట్లనుచుండిరి.

చ. నెనరునఁ గాంచి మోదము జనింపఁగఁ జేయఁగ నేగుదెంచి యా
జనకనరేంద్రుఁ డిన్ని దివసంబులు వేడుకఁ బుచ్చి యిత్తఱిం
జనియె విదేహదేశమని. జానకి చింతిల నంతఁదీర్ప వా
సనిలయగామియయ్యె నృపచంద్రుఁడు గద్దియడిగ్గి దిగ్గునన్. 8.

(నిష్క్రమించిరి.)

ఇది,

ప్రస్తావన.

---

వాసనిలయగామి — అంతఃపురమును గూర్చి వెళ్ళినవాఁడు.



# ఆంధ్రీకృతోత్తర రామచరిత్రము.

## ప్రథమాంకము.

(రామభద్రుఁడు, సీతయు నుపవిష్టులై ప్రవేశింతురు)

రామ—దేవి ! వైదేహీ ! ఊరడిల్లుము. ఆ గురువులు మనల విడువఁ జాలరు. వినుము

గీ. నిత్యకర్మాద్యనుష్ఠాన నియతి స్వైర
పరత నపకర్షణ మొనర్చు బ్రత్యవాయ
ముల కతంబున నాహితాగ్నులకుఁ దలఁప
నధికకష్టంబుగాదె గార్హస్థ్య మనఁగ. 9.

సీత—ఎఱుంగుదును. ఆర్యపుత్త్ర! యెఱుంగుదును. అయినను గురుబంధు వియోగంబులు సంతాప జనకంబులై యుండును.

రామ—ఔను. ఈ సంసార భావములు హృదయ మర్మముల భేదించు చుండునుగదా! వీని రోసి యెల్ల కోరికల నెడబాసి మనీషు లరణ్యమున విశ్రమించు చుందురు.

కంచుకి—(ప్రవేశించి) జయము రామభద్ర ! (అర్ధోక్తిలో సంశయించి) మహారాజ !

రామ—(చిఱునగవుతో) ఆర్యా ! జనకపరిజనము నన్ను "రామభద్రా" ! యని పిలుచుటయె శోభాస్పదము. కాన నీ యభ్యాసానుసారమునఁ బిలువుము.

కంచు—ఋష్యశృంగాశ్రమమునుండి యష్టావక్రముని విచ్చేసియుండె.

సీత—ఆర్యా ! యింకఁ దడవేల ?

రామ—త్వరితముగఁ బ్రవేశపెట్టుము. (కంచుకి నిష్క్రమించెను.)

అష్టా—(ప్రవేశించి) మీకు శుభ మగుఁ గాక !

రామ—అభివాదనము. ఇట గూర్చుండుఁడు.

సీత—నీకు వందనము. మఱియు సర్వగురుజనంబునకు నార్య యగు శాంతకుఁ గుశలమా ?

రామ—మద్భావుకుండును మహాత్ముఁడును నగు ఋశ్యశృంగమహాముని యార్యయగు శాంతతో నిర్విఘ్నముగ సోమపానముఁ గావించెనా !

సీత—మమ్ముఁ దలఁపోయుచుండెనా ?

అష్టా—(కూర్చుండి) ఔను దేవీ ! భగవానుఁ డగు వసిష్ఠుండు నిన్నుఁ గూర్చి యిట్లు పలికెను.

మ. "చతురాస్య ప్రతిరూపుఁడౌ జనకరాజన్యుండు నీతండ్రి, యా
సతి విశ్వంభర నీదు తల్లి, యలభాస్వంతుండును నెమ్మము న
న్నలరి నీ రాజకుటుంబకంబున గురుత్వంబూని యున్నార మా
క్షితిరాట్చంద్రుల కీవు కోడలవు చర్చింపంగ నోనందనీ ! 10

కాన నింకేమి కోరుదుము ? తప్పక వీరజననివి కమ్ము"

రామ—అనుగ్రహింపఁ బడితిమి.

గీ. లౌకిక సంబంధు లైన సుశ్లోకజనుల
భాషితం బర్థమై ధురిఁ బట్టినడుచు
నాదిమౌనుల వచనంబు నర్థ మెల్ల
యనుసరించుచు నుండు నుదారభంగి. 11.

అష్టా—భగవతి యరుంధతియు, దేవులు, శాంతయుఁ, బదెంబడి నిదియే సందేశించిరి. "ఈమె కెద్ది యైన దౌహృదవాంఛ జనించెనేని దానిఁ జెచ్చెర నెఱవేర్పవలయు" నని.

రామ—నెఱవేర్చెద నీమె తెల్పెనేని.

అష్టా—ననాందృభర్త యగు ఋశ్యశృంగమహాముని దేవికి సందేశించె. "వత్సా ! పరిపూర్ణగర్భ వని తోడితేనేదు బాలుఁ డగు రామభద్రుండును భవద్వినోదంబు

ననాంద=ఆఁడుబిడ్డ. అభివాదనము=గోత్రనామములు చెప్పి పాదములు సోఁకి మ్రొక్కుట.

కొఱకె నిల్పఁబడియె. కాన నందనాలంకృతాంక వగు నాయుష్మతిం జూడఁ గలము.'' అని.

రామ—(హర్ష లజ్జాస్మితములతో) అట్లగుఁగాక ! భగవంతుఁ డగు వసిష్ఠునిచే నేమియు సందేశింపఁ బడ లేదా ?

అష్టా—వినుము.

గీ. మము నిరోధించె నిచట జామాతృయజ్ఞ
మర్భకుండవు నీవు రాజ్యంబు క్రొత్త,
ప్రజల రంజింపఁ గడఁగు మేర్పడ, యశంబు
స్వాత్మకన్నను మీకు దివ్యార్థముగద !'' 12.

రామ—భగవానుఁ డగు మైత్రావరుణి యాజ్ఞ చొప్పున నే—

క. కరుణన్ మైత్రిని సౌఖ్యము
సరగున జనకసుత నైన జనగంజనమున్
నెఱపఁగ విడిచెద నాకుం
దొరకొన దొక్కింత యైన దుఃఖము మదిలోన్. 13.

సీత—కావుననే, ఆర్యపుత్త్రుండు రఘురాజధురంధరుండు.

రామ—ఎవఁడురా అచ్చట ? అష్టావక్రునకు విశ్రమింపఁ జేయఁబడుఁగాక !

అష్టా—(లేచిపరిక్రమించి) ఓయీ ! లక్ష్మణకుమారుఁ డరుదెంచె. (నిష్క్రా—)

లక్ష్మ—(ప్రవేశించి) ఆర్యా ! జయమగుఁగాక ! ఆ చిత్రకారునిచే నస్మన్నిర్దేశంబున నీ వీధికయం దార్యచరిత్రము విలిఖింపఁబడియె. కావునఁ గనుంగొనుము.

రామ—వత్సా ! యెఱుంగుదువా ! వికలాత్మయైన జనకనందని నానందింపఁజేయు నిమిత్తము. ఇం దెంతదనుక వ్రాయఁబడినది?

లక్ష్మ—ఆర్యురాలి పావకశుద్ధివఱకు.

రామ—పాపము శాంతించుఁగాక !

క. జనన పరిపూత యగు భూ
తనయ కితర పావనములఁ దలఁపఁగ నేలా ?
ఘన తీర్థోదక మగ్నియు
నను పుగ వేఱొకట శుద్ధి కర్హము లగునే ? 14.

---

జామాత=అల్లుఁడు. మైత్రావరుణి=వసిష్ఠుఁడు.

దేవీ ! పవనమహీనందని ! ప్రసన్నవు గమ్ము. ఈ యంజలి యావజ్జీవమైనది.

చ. అలలితమై చరించుజన మాత్మజనంబులచేత సాంత్వవా
క్కులఁ దనురంజనీయ మగుఁ, గోమలి ! నిన్ను నమంగళోక్తులం
దలఁకఁగఁ జేయ మా కనుచితంబు, సుగంధిల పుష్పరాజముం
దలనిడఁ జెల్లుఁ గాని చరణంబులఁ దన్న నిసర్గశైలియే ? 15.

సీత—పోఁగాక ! ఆర్యపుత్రా ! రమ్ము నీ చరితంబు నభిలక్షింతము.
(లేచి పరిక్రమింతురు.)

లక్ష్మ—ఇదే ! తదాలేఖ్యము.

సీత—(చూచి) వీరెవ్వరు ? ఊర్ధ్వభాగమున నిరంతరస్థితులై యార్యపుత్త్రుని నుతియించుచున్నట్లున్నవారు.

లక్ష్మ—సరహస్యంబు లగు నాజృంభకాస్త్రంబు లివియే. ఇవి భగవంతుం డగు భృశాశ్వుని వలనఁ గుశికనందనుండును విశ్వమిత్రుండు నగు విశ్వామిత్రముని యం దుపసంక్రమించి వారిచేఁ దాటకావధంబున నార్యునికిఁ బ్రసాదింపఁ బడినవి.

రామ—దేవీ ! దివ్యాస్త్రములకుఁ బ్రణమిల్లుము.

గీ. నలువ మున్నగు తొంటిపెద్దలు జగద్ధి
తంబు కొఱకు సహస్రాధికంబు లబ్ద
ములు దపముఁజేసి నిజతపోమూర్తతేజ
ములుగ వెలసిల్లు నీయస్త్రములను గనిరి. 16.

సీత—నమస్కారగ విూ దివ్యాస్త్రములకు.

రామ—ఇయ్యవి సర్వవిధంబుల నీ సంతతి నొందఁ గలవు.

సీత—అనుగృహీత నైతిని.

లక్ష్మ—ఇది మిధిలావృత్తాంతము.

సీత—ఓహో ! నవవికచేందీవరశ్యామలంబై స్నిగ్ధాపీనకోమలంబైన దేహ సౌభాగ్యం బున కక్కజంబునందు జనకభూపాలునిచే నిశ్చలంబుగాఁ జూడఁబడు రమ్యసౌం దర్యలక్ష్మితోడను, కాకపక్షావతంసితం బగు ముఖమండలంబుతోడను లీలాసమా క్రాంత వగవేశకార్ముకుం డగు నార్యపుత్త్రుండు లిఖియింపఁబడెను.

---

అభిలక్షింతము = చూతము, మూర్త = శరీరమును ధరించిన, ఆలేఖ్యము = చిత్తరువు=న్యాసము.

లక్ష్మ—ఆర్యురాలా ! చూడుము చూడుము.

క. బందుగులకు నీ జనకుఁడు
నందముగ వసిష్ఠముఖ్యు లంపతికి శతా
నందుఁడు గౌతముఁ డను జన
కేంద్రపురోహితుఁడు బూజ లిడుచుండిరోగిన్. 17.

రామ—దర్శనీయమిది—

క. జనక రఘురాజ కులముల
యనుబంధం బెవని కిష్టమై యుండెడు ? ది
నిని సమకూర్పఁగఁ గౌశికుఁ
డొనరఁగఁ దాతయు గృహీతయును దా నయ్యెన్ 18.

సీత—సద్యఃకృత గోదాన మంగళులై వివాహదీక్షితులైన మీ నల్వురు సోదరులును వీరేకదా ! ఓహో ! అదేప్రదేశమున నదేసమయమున నుంటి నని తలంచుచుంటిని.

రామ— గీ. గౌతముఁడు నాకొసఁగ రమ్యకంకణమున
నొనరఁబట్టిన నీ కేల్, మహోత్సవంబు
మూర్తిఁదాల్చిన యట్లు న న్ముదితుఁ జేయు
నాటితటి నేటివలెనుండె నళినవదన ! 19.

లక్ష్మ—ఈమె యార్య, ఈమెయు నార్యమాండవి; ఇయ్యది వధువు శ్రుతకీర్తి.

సీత—(నవ్వుచు) వత్సా ! యింకొకతె యిదియెవ్వతె ?

లక్ష్మ—(లజ్జాస్మితములతోఁ దనలో) ఓహో ! ఆర్యయూర్మిళ నడుగుచున్నది. ఔఁగాక ! ముందుజరిపెదను. (ప్రకాశముగా) ఆర్యా ! చూడుము. దర్శనీయమిది. ఇదే ! భగవానుఁ డగు భార్గవుండు—

సీత—చకితురాలనైతిని.

రామ—ఋషీంద్రా ! నీకునమస్కారము.

లక్ష్మ—ఆర్యురాలా ! చూడుము. ఈతఁ డార్యునిచే—

రామ—(సాక్షేపముగా) ఓయీ ! దర్శనీయము పెక్కుగలదు. వేఱొకటిఁ జూపుము.

---

సద్యః=అప్పుడే, కృత=చేయఁబడిన, గోదాన= క్షౌరముచేత, చకితురాల= భయపడినదానను.

సీత—(సమ్మానముతోఁజూచి) ఆర్యపుత్త్రుఁడీ వినయ మహిమచే లెస్సగా దీపించుచుండె.

లక్ష్మ—ఇదే మన మయోధ్యఁ జేరితిమి.

రామ—(కన్నీళ్ళతో) స్మరించుచుంటిని అన్నా! స్మరించుచుంటిని.

క. జనకుఁడు జీవింపఁగ నా
తనదారపరిగ్రహంబు దనరిన వేళం
జననీ పోష్యుల మగు మా
కునదివసము లవి గతించెగాదే? తలఁపన్. 20

అప్పుడీ జానకియు—

చ. పడి యెడనూ కెలంకులను బట్టి జనించెడి పల్లు మొగ్గలం,
బెడఁగగు దంతపుష్పముల, బిత్తరి చూపుల, నొప్పు మోముతో
విడలెడు కౌముదీ సహజ విభ్రమ రమ్య విలాస రేఖలం
దొడరిన యంగకంబులఁ గుతూహల మిచ్చె మదంగరాజికిన్. 21

లక్ష్మ—ఇదె మంథర.

రాము—(నిరుత్తరముగా వేఱొకటఁ జేరి) దేవీ! విదేహరాజనందని!

ఆ. మున్ను శృంగిబేర పురమున సౌహార్ద
వంతుఁడౌ నిషాద భర్తతోడ
మనకు మోదమున సమావేశ దేశమై
యొసఁగు నింగుదీమహీజ మిదియె. 22

లక్ష్మ—(నవ్వితనలో) ఓహో! ఆర్యుండు మధ్యమాంబికా వృత్తాంతంబు నంతరింపఁజేసె.

సీత—ఓహో! యిది జటాబంధ వృత్తాంతము.

లక్ష్మ— గీ. వార్ధకంబున రాజ్యసంపదల నెల్లఁ
బుత్త్రులం దుంచి యిక్ష్వాకు భూమిపతులు
గాంచు పుణ్యంపు టారణ్యక వ్రతంబు
నార్యుఁ డిమ్ములఁ దాల్చె బాల్యంబునందె. 23

సీత—ఇదే! నిర్మలపుణ్యోదక యగు భగవతి భాగీరథి.

రామ—దేవీ! రఘువంశదేవతా! నీకు నమస్కారము.

---

కౌముది=వెన్నెల, ఇంగుదీమహీజము=గారచెట్టు.

చ. అల సగరాన్వయంబునఁ దదాత్మజు లశ్వము రోయ ధారుణిం
దొలుచుచు రోషవత్కపిల దుస్సహ తేజమునం బ్రదగ్ధులై
పొలియ భగీరథుండు దనుపు న్వెతఁ గూర్చి తపం బొనర్చి నీ
జలములఁ దృప్తిమై దడిపి సాధ్వి ! తరింపఁగఁ జేసెఁ దాతలన్. 24.

జననీ ! అట్టి నీవు కోడలగు జానకియుం దరుంధతియుం బోలె మంగళాశాసనంబు గావించుచుండుము.

లక్ష్మ—ఇది చిత్రకూట మార్గమందలి కాళిందీతటంబున భరద్వాజ ప్రదర్శితంబైన శ్యామమను వటవృక్షము.

సీత—ఆర్యపుత్త్రుఁ డీప్రదేశముం దలంచుచుండెడిని.

రామ—ఓహో ! యెట్లు మఱపువచ్చును ?

మ. గమనాయాసముచేత దుర్బలములై క్లాంతాతి తాంతంబులై
ప్రమదాలింగన దత్త సర్వతను సంవాహంబులై, పీడనా
ర్తమ్ళణాళీమృదులంబులై, తగుభవద్గాత్రంబులన్ నాదు వ
త్సమునం జేరిచి నిద్రవోయితివి గాదా ! యీ ప్రదేశంబునన్ ? 25.

లక్ష్మ—ఇది వింధ్యారణ్య పురోభాగమున విరాధ నిరోధము.

సీత—ఇది చాలును. ఆర్యపుత్త్రుండు దాళవృంతంబు నాతపత్రంబుగాఁ గేలధరియించి ప్రారంభించు దక్షిణారణ్య ప్రవేశముం జూచెదను.

లక్ష్మ-ఉ. మానిత శాంతులై యతిథి మాననులై నిజసృష్టి సమ్మితం
బౌ నివరుల్ పచించెడి గృహస్థుల నొప్పు గృహాళితోడ, వై
ఖానస వాసయోగ్య తరుకాండము తోఁ దగి శైలవాహినీ
స్థాన తటంబులం జెలఁగు తాపస వాటిక లివ్వియేకదా ! 26.

ఇది క్రిక్కిరిసిన వృక్షసంఘములచే నెపము లేక నున్నదై కాఱుకొన్న ప్రాంతారణ్యంబుచేఁ జుట్టుముట్టఁ బడిన గోదావరి వలన మొరయు కందరంబుల నందగించి, తెఱపిలేక కురియు మొగిళ్ళచేఁ గప్పఁబడినదైన కప్పున నొప్పు జనస్థాన మధ్య మందలి ప్రస్రవణ శైలము.

---

వత్సము=వక్షము. క్లాంతము-తాంతము=బడలినది. సంవాహనము=పట్టుట, పిసుకుట. మొగిళ్ళు=మేఘములు, తాళవృంతంబు=తాటియాకు విసనకఱ్ఱ, ఆతపత్రంబు = గొడుగు, వైఖానసుఁడు=వానప్రస్థుఁడు.

రామ-ఉ. భావమునం దలంతువె సుభాంగిరో ! లక్ష్మణుఁ డా నగరంబునన్
సేవ యొనర్ప చూడ సుఖజీవనతం జను నా దినంబులన్ ?
భావనఁ జేయుదే సరస పావన నీరములం దనర్చు గో
దావరి ? నచ్చటన్ మన యథాగ విహారములన్ స్మరింతువే ? 27.

మఱియును—

ఉ. మక్కువ పిక్కటిల్లఁగ సమాగమఁ జెక్కులు సేర్చి తారుమా
రెక్కఁగ మెల్లమెల్ల మన మెట్టిటొ యక్రమభాష లాడుచో
నొక్కొక భుజంబుతోడి యొడ కౌగ్గని కౌఁగిలిలన్ సుఖింప నా
చక్కని రాత్రియే గడచె జాము తెలుంగక యుండ బిట్టయెన్. 28.

లక్ష్మ—ఇదె పంచవటియందు శూర్పణఖ—
సీత—హా ! ఆర్యపుత్త్రా ! ఇంతవఱకే నిదర్శనము.
రామ—ఓ వియోగభీరువా ! చిత్రము విది.
సీత—ఎట్లయిన నగుఁ గాక ! దుర్జనుఁడు దుఃఖము నుత్పాదించు.
రామ—అన్నా ! జనస్థాన వృత్తాంతము జరుగుచున్నట్లే తోఁచుచున్నది.
లక్ష్మ-మ. కనకాకార మృగంబు మాయవలనం గల్పించి పాపాత్ములౌ
దనుజుల్ కైదొనరించి రట్లు లయ మొందం జేసినన్ శోకముం
జన దా వైరము, శూన్యమై తగు జనస్థానంబునం బార్తి జెం
దిన యార్యుం గని శైలమేదుర్, హృదయంబో ఖిన్నంబగున్ వజ్రమున్. 29.

సీత—(కన్నీళ్లతో. స్వ) ఓ దేవా ! రఘుకులనందనా ! నానిమిత్తమై యిట్లు వంతఁ జెందితివి గదా !

లక్ష్మ—(రామునిఁ జూచి సాభిప్రాయముగా) ఆర్యా ! ఏమిది !

చ. తునిఁగిన ముత్తెపుసరము తోయమునన్ భవదశ్రుబిందువుల్
కనులను ధారలై విడి యిలం బడి పొర్లెనిదే ! గొఱుపంద బొం
గి నిగుడు దుఃఖవేగ మడఁగింప నశింగక నాసికాధరం
బునుగదలించి యన్యజనబోధము దా నొనరించె నద్దిరా ! 30.

రామ—వత్సా !

గీ. నాడు ప్రియజన విరహ జన్య మగు దుఃఖ
వహ్ని ఘనమయ్యుఁ బ్రతిక్రియావాంఛ నొర్వఁ

నగరంబునన్=పర్వతమున. తోయమునన్=రీతిని. ఖరము=తీక్ష్ణము.

బడి మనంబున, మరల విపక్వ మయిన
హృదయ మర్మవ్రణంబునా నెరియఁ జేసె. 31.

సీత—నేనును మితిమీఱిన విరహభావనచే న న్నార్యపుత్త్రి శూన్యురాలిఁగాఁ దలంచుచుంటిని.

లక్ష్మ—(తనలో) ఔనన్నట్లే ! వేఱొకటి చూపెదను. (చిత్రమును జూచి ప్రకాశముగా) ఇదిగో ! యిదె మన్వంతర వృద్ధుఁ డగు గృధ్రరాజైన తాత జటాయుని విక్రమ చరిత్రన్యాసము.

సీత—హా ! తండ్రీ ! నీవు త్రివాత్సల్యము నిర్వహింపఁ బడినది.

రామ—తీర్థభూతుఁ డగు నంతటి సజ్జనుం డెచ్చట లభించును ?

లక్ష్మ—ఇదిగో ! యిది జనస్థానమునకుఁ బశ్చిమ తటంబున దను వను కబంధుండు నివసించు చిత్రకుంజ మను దండకారణ్యభాగము—ఋశ్యమూక మాదలి యా మతంగాశ్రమ మిది—ఇది శ్రమణ యను సిద్ధశబరి—ఇదే ! పద్మపంపాసరంబు.

సీత— రోషగాంభీర్యములు విడిచి యార్యపుత్త్రుఁ డిచ్చటనేగదా పెద్ద యెలుంగుతో రోదన మొనర్చె.

రామ—దేవీ ! ఈపద్మసరస్సు రమణీయమైనది.

చ. మదకలహంస పక్షముల మాటికిఁ గంపిలుచున్న దీర్ఘనా
ళ దళిత వారిజవ్రజములం దగి కైరవప జ్క్తి నొప్పు త
త్పదమల నీరభాగములఁ జయ్యన బాష్పము రాలి వెండియుం
బొడిలెడు నంతరాళమునఁ బొందుగఁ జూచితి నా సగస్సునన్. 32.

లక్ష్మ—ఇతఁ డార్యుఁ డగు హనుమంతుఁడు.

సీత—ఇతఁడు చిరనిర్వేదమును బొందు జీవలోకము నుద్ధరించిన మహోపకారకుండును మహాభాగుండు నగు మరున్నందనుండు.

రామ— గీ. అంజనానంద వర్ధనుం డైన యట్టి
ఘనభుజుఁ డితండు కళ్యాణ కారణుండు
మనకు జగముల కి మ్మహామహుని శౌర్య
సంపదలచేత ధన్యత సంధనిల్లె. 33.

దళిత=వికసించిన. వారిజము=పద్మము, కైరవము=కలువ. అంతరాళమున= మధ్యకాలమున.

సీత—వత్సా! కుసుమిత కదంబ నృత్యన్మయూరం బైన యి మ్మహీధరంబు పేరేమి? ఇచ్చటఁ బరిభావ సౌందర్యమాత్ర పరిశేషమైన ధూసరిత లావణ్యముతో క్షణమాత్ర మూర్ఛితుం డగు నార్యపుత్త్రుండు దుఃఖాయమానుండ వగు నీచే ధరింపఁ బడిన వాఁ డై వృక్షమూలమున లిఖింపఁబడియె.

లక్ష్మ—శా. శ్యామ స్నిగ్ధ నవాంబుదాశ్రిత శిరస్థానంబు, సాలద్రుమ
వ్యామీలత్సుమ సౌరభం బిదియె సుమ్మా మాల్యవచ్ఛైల మా

రామ— సౌమిత్రీ! యిఁకఁ జాలు చాలును వినం జాలం బరార్థంబు, సీ
తాముంగళ్యవతీ వియోగ మిదె! సిద్ధం బయ్యెడిన్ వెండియున్. 34.

లక్ష్మ—పిదప నార్యునియొక్కయుఁ బూజ్యులగు కపిదానవులయొక్కయు నగణ్యంబులగు నుత్తరోత్తర చిత్రకృత్యంబులుకలవు. ఈయార్యయుఁ బరిశ్రాంతయైనది కాన విశ్రమింపఁ జేయుఁడని విన్నవించుచుంటిని.

సీత—ఆర్యపుత్త్ర! యీ చిత్రదర్శనంబుచే సాభిలాషనగు నే నొకటి విన్నవించెదను.

రామ—ఆజ్ఞాపింపుము.

సీత—ప్రసన్న గంభీరంబులగు గహన విథులఁ జరింప వలయు ననియుఁ బావన విమల శీతలావగాహయు భగవతియు నగు భాగీరథియందు విహరింప వలయు ననియుం గోరుచుంటిని.

రామ—వత్స! లక్ష్మణ! "అభిలాష చెచ్చెర నెఱవేర్పవలయు" నని యిప్పుడే గురుజనాజ్ఞ యైనది. కాన నస్ఖలిత సుఖ సంప్రసారమైన శతాంగంబు దెప్పింపుము.

సీత—ఆర్యపుత్త్ర! మీరు నచ్చటికి రావలయును.

రామ—కఠినహృదయా! యిదియుం జెప్పవలయునా?

సీత—అట్లయిన నాకిష్టమే—

అవగాహము=స్నానము. అస్ఖలిత=చలించని, సంప్రసారమైన=గమనముగల, శతాంగము=రథము. శ్యామ=నల్లనయిన, స్నిగ్ధ=నునుపగు, నవాంబుద=క్రొత్త మేఘముచే, ఆశ్రిత=ఆశ్రయింపఁబడిన, శిరస్థానంబు=శిఖరములుగలది, సాలద్రుమ=మద్దిచెట్లయొక్క, వ్యామీలత్=వికసించిన, సుమసౌరభము=పుష్పపరిమళము గలదియు,

లక్ష్మ—ఆర్యాజ్ఞ నిర్వర్తింతును. (నిష్క్రమించును.)
రామ—ప్రేయసీ! యీ గవాక్షమండలమం దొకింతసేపు శయనింతము.
సీత—ఔఁగాక! ప్రయాస జనిత మగు నిద్రచే నపహరింపఁబడుచుంటిని.
రామ—ఇచట శయనింప నన్ను దృఢముగాఁ నవలంబింపుము.

గీ. ఖేద సాధ్వస నిస్సృత స్వేదబిందు
సాంద్రమై చంద్రకరమిళ చ్చంద్రకాంత
సరమునుం బోని భుజము కంధరమునందుఁ
జేర్చెదవుగాక! జీవంబుఁ గూర్చు బోక. 35.

(అట్లు చేయించి సానందముగా) ప్రియా! యేమిఁ?

మ. అరయన్ సౌఖ్యమొ? దుఃఖమో? తెలియ శక్యం బింతయుంగాదు, దు
ర్భర సమ్మోహమొ? నిద్రయో? విషవిసర్పంబో? మదంబో? భవ
త్స్పరస స్పర్శములన్ మదింద్రియతతిన్ సమ్మూర్ఛ నొందించు బం
ధుర భావం బిది జీవము న్మెలిచి యున్మూలంబు గావించెడున్. 36.

సీత—మీరు నిశ్చల ప్రసాదులు. ఇప్పుడింతకన్నఁ గావలసిన దేమి?
రామ— గీ. క్లాంత జీవన కుసుమ వికాసనమ్ము,
లింద్రియ విమోహనములు, సంతృప్తిదములు,
పంకజాతాక్షి! భవదీయ భాషణములు,
స్వాంత సురసాయనములు, కర్ణామృతములు. 37.

సీత—ప్రియంవదా! శయనింతును. (శయ్యకై యంతటం బరికించును.)
రామ—ఓహో! యేమి వెదకెదవు?

గీ. పరిణయం బాది గృహమందు, వనమునందు,
బాల్యమందును, బిదప యౌవనమునందు,
శయన హేతు వనన్య సంశ్రయము నైన
రాముని భుజంబు సదుపబర్హంబు నీకు. 38

సీత—(నిద్రనభినయించుచు) ఔను కలదిది, ఆర్యపుత్రా! కలదిది. (నిద్రించును)
రామ—ఏమి? ప్రియభాషిణి వక్షమున నిద్రించె నే? (చూచి స్నేహముతో)

సాధ్వసనిస్సృత = భయముచే బయలువెడలిన. సమ్మోహము = మూర్ఛ, విష విసర్పంబో = విషవ్యాప్తియో, క్లాంత = వాడిన రసాయనము = ఔషధము. ఉపబర్హము = దిండు,

వ. ఇదిగృహలక్ష్మి; నేత్రముల కిద్ది సుధారసవర్తి; యీ సుఖ
స్పర్శ మగు దీని స్పర్శ మెయి రాచిన చందనసారపూర; మీ
మృదుభుజ మీ గళంబున రసించెడు చల్లనిముత్తెపు సరం;
ఔర నెది యేదియును రసింపదు దుస్సహమౌ వియోగమే. 39.

ప్రతీహారి—(ప్రవేశించి) దేవా! వచ్చెను.

రామ—ఓసీ! ఎవ్వరు?

ప్రతీ—దేవర సన్నిధాన సేవకుఁడగు దుర్ముఖుఁడు.

రామ—(తనలో) అంతఃపుర సంచారి దుర్ముఖుఁడా? పౌర జానపదుల భావసంవేదనమునకై పనిచియుంటిని. (ప్రకాశము) వచ్చుఁగాక!

ప్రతీ—(నిష్క్రమించును)

దుర్ము—(ప్రవేశించి తనలో) హాహా! సీతాదేవిపై నసంభావ్య మైన యిట్టి జనాపవాదమును దేవర కెట్లు తెల్పుదును? మందభాగ్యుఁడను నాని యోగ మిట్టిదే కదా!

సీత—(కలవరించుచు) హా! ఆర్యపుత్ర! సౌమ్యా! యెచ్చటనుంటివి?

రామ—ఓహో! చిత్రదర్శనంబున సంక్షోభకారి యైన విరహభావన దేవికి స్వప్నోద్వేగమును గల్గించుచున్నది. (అనురాగముతో మేను నిమురుచు)

ఉ. ఎయ్యది ఖేదమోదముల నేకము; సర్వదశానుబద్ధమే;
దెయ్యెడ విశ్రమించు మన; మెంచలిరక్తి జరానపాయమౌ;
* నెయ్యది యోలి లజ్జనశియింప ఘనప్రణయంబుఁ గాంచు; నా
నెయ్యపు జంటకున్ శుభము నిత్యము గోరఁబడుం గడంకతోన్. 40.

* "నెయ్యగు ప్రేమ సాంగమయి యొసఁగు నావరణాత్యయంబు", వయిపద్యమునందలి మూఁడవచరణమునకు మాఱుగనిట్లు గూడఁ జదువుకొనవచ్చును. మూలమునందుఁ గల "ఆవరణాత్యయాత్" అను పదమునకు రెండర్థములు గలవు. ఆవరణము=అడ్డు. దీని చేలజ్జ స్ఫురించును. అనఁగను మొక్కి—అనఁగా లజ్జ మొక్కి, అత్యయాత్=నాశము వలన, ప్రేమ హెచ్చునని యొకయర్థము. రెండవది:—వరణమనఁగా వివాహము, ఆవరణమన వివాహము మొదలుకొని, అత్యయాత్=అంతమువఱకు, అనఁగా మరణపర్యంతము విడువని ప్రేమగలదియని. ఈరెండిటియందును మొదటియర్థమే యెక్కువ గసవంతమైనదని పెద్దలమతము. కావున దానినే పద్యమునందు వ్యక్తీకరించితిమి. పఠాంతరమున శ్లేషకనువగు నావరణాత్యయము అనుమూలపాద భాగమునే ప్రయోగించితిమి.

దుర్ము—(సమీపించి) జయము దేవా !

రామ—తెల్పుము నీ నెఱింగినది.

దుర్ము—"రామభద్రునిచే మహారాజ దశరథుని మఱచితి" మని పౌరజానపదులు దేవరం గొనియాడుచుండిరి.

రామ—అర్థవాదమిది. దోషమేమైనఁ దెల్పుము. దాని నివర్తించెదను.

దుర్ము—(కన్నీరుతో) దేవా ! వినుము. (కర్ణమున నిట్లనును)

రామ—అహాహా ! వాగ్వజ్రము తీవ్రమైనది. (మూర్ఛిల్లును.)

దుర్ము—దేవా ! ఊరడిల్లుము.

రామ—(ఊరడిలి)

గీ. అకట జానకి కన్య గేహప్రవాస
దోష మణఁగింపఁ బడిరొ సద్భూతపు విధుల
నదిరొ పెండియు దుర్విధిప్రాప్తి వలన
విరిసె నెల్లెడ నాలర్క విషము వోలె. 41.

కాన నిందు మందభాగ్యుండ నగు నే నేమి సేయుదును ? (విమర్శించి దైన్యముతో) ఇంకేమిగలదు ?

గీ. శిష్టులకు నెట్టి కృత్యంబు చేతనైన
జనుల యిష్టానుసరణంబు సద్వ్రతంబు
నన్నుఁ బ్రాణంబులను వీఁడు నాదుజనకు
చేత నీ సద్వ్రతంబె ప్రాజింపఁబడిగొ. 42.

భగవంతుఁడగు వసిష్ఠభగవానియు నిట్లనార్తనంపె మఱియు.

గీ. భువనవరులైన రవివంశ భూమిపతుల
సచ్చరిత్రంబు మిగుల నుజ్జ్వలిత మయ్యె
నందు నను బట్టి కళ్మల మహా నదంతి
దొరలె నేని ! వ్యర్థుఁడ వినిందుంగ్యుండ నకట ! 43

హా ! దేవి ! సవన ధాత్రీతనూజా ! హా ! స్వజన్మానుగ్రహపావనీకృత విశ్వంభరా ! హా ! నిమిజనకకులానందదాయిని ! హా ! పావక వసిష్ఠారుంధతీ స్తూయమాన సద్వృత్త శాలిని ! హా ! రామైకజీవితా ! హా ! దుర్గమారణ్య వాస ప్రియసఖి ! హా ! హిత మిత భాషిణీ ! యిట్టిదా యీ దశాపరిణామము.

ఆలర్క=వెఱ్ఱికుక్కయొక్క, ఉజ్జ్వలితము=ప్రకాశమానము,

గీ. నీవలన విష్టపములెల్లఁ బావనములు
ప్రజల వాక్కులు నీయందపావనములు
నీవలన నాథవంతములౌ నిఖిలజగము
లీ వనాథురాల వయి వాపోవుదింక. 44.

దుర్ముఖ ! లక్ష్మణునితో నీ నవీన రాజు రాముఁ డాజ్ఞాపించు చున్నాఁడని తెల్పుము. (కర్ణమునఁనిట్టిటు)

దుర్ము—పావక పరిపూతయు గర్భస్థిత పవిత్ర రఘుకుల సంతతియు నగు దేవియెడల దుర్జన వాక్యమున దేవరచే నీచందమున నేల నిర్ణయింపఁబడినది ?

రామ—చాలు ! పౌరజానపదు లెట్లు దుర్జనులు ? చూడుము.

గీ. ప్రజల కభిమతమైన దిక్ష్వాకుకులము
విధివశంబున నపవాద బీజ మొదవె
నద్భుతపు శోధఁ జేసితి మంటి మేని
నమ్మ నెవ్వఁడు దూర వృత్తమ్ము మదిని ? 45.

కావునం బొమ్ము—

దుర్ము—హా ! దేవి ! (నిష్క్రమించును)

రామ—హా ! కష్టము ! అతిఘోర మొనర్చు ఘాతుకుండ నైతిని. నేను—

ఉ. పిన్నటనాటనో లెఁ గడుఁ బ్రీతినిఁ బెంపుడు జెంది కూర్మిచే
భిన్నముగాని భావమునఁ జేర్మి వహించెడి దీనిఁ బన్నికం
బన్ని గృహంబునం దనుచు పక్షుఁబులిందునకట్లు సౌహృదం
బెన్నక మృత్యువక్త్రమున కింక సమర్పణ మాచరించితిన్. 46.

కాన ముట్టరాని పాతకినైన నేను దేవి నపవిత్రపఱతునా యేమి ?

(సీతశిరంబు నించుక యెత్తి బాహువుం దివిచి)

ఆ. చను మపూర్వ కర్మ చండాలుఁడను నన్ను
ముట్ట కింక విడుము ముగ్ధరాల !
సంశ్రయించి తీవు చందన భ్రాంతిచే
విలయ హేతువైన విషకుజంబు. 47

---

విష్టపములు=జగములు, పులిందుఁడు=కిరాతుఁడు, సౌహృదంబు=స్నేహము వక్త్రము=ముఖము, సంశ్రయించితి=ఆశ్రయించితివి. విలయ=ప్రాణాపాయము నకు

అన్నా ! జీవలోక మిపుడు వ్యత్యస్త మయినది. రాముని జీవితఫలం బవసన్న మైనది. ఇప్పుడు జగంబు శూన్యంబై జీర్ణారణ్య మైనది. సంసారము నిస్సారము. కాయము కాష్ఠప్రాయము. అశరణుండ నైతిని. ఏమి చేయుదును ! ఏదిగతి ?

గీ. ఉమ్మలికము నెఱుంగఁ జేయుటకె రాము
నందుఁ జైతన్య మాగతం బయ్యె మరలఁ
బ్రాణములు మేన నిల్చి మర్మములఁ గలఁచి
వజ్రకీలంబు లటుల దుర్వాహము లయ్యె. 48.

హా ! జననీ ! అరుంధతీ ! హా ! భగవంతులారా ! వసిష్ఠ విశ్వామిత్రులారా ! హా ! మహాత్మా ! పావక ! హా ! దేవీ ! భూతధాత్రి ! హా ! తండ్రీ ! జనక ! హా ! తండ్రీ ! హా ! మాతలారా ! హా ! మహోపకృతి ! లంకాపతీ ! విభీషణ ! హా ! ప్రియమిత్ర ! సుగ్రీవ ! హా ! సౌమ్య ! మరున్నందన ! హా ! సఖీ ! త్రిజటా ! హతప్రాయుఁడగు రామునిచే మీరెల్లరుఁ దిరస్కరింపఁ బడితిరి; ఇపుడు వారిఁజీర నే నెవ్వండను ?

క. ననుఁ బెమ్మహామహులు దు
ర్జనుఁడఁ గృతఘ్నుండ ననఁగఁ జను నాచే ని
య్యనువునఁ జీరంబడి యొ
య్యనఁ గలుషీభూతు లౌదు రనుచుఁదలంతున్. 49.

చ. నను మదినమ్మి హృత్తటమునం బడి నిద్రలుచున్న గేహల
క్ష్మిని, భయభావనాస్ఫురిత మేదుర గర్భ భరాలసం, బ్రియాం
గన, నిటులం దృజించి యనుకంప యొకింతయు లేక మానవా
శనులకు నేబలింబ లెనొసంగుచు నుంటిని క్రూరవృత్తితోన్. 50.

(సీత పాదముల శిరమును జేర్చి) దేవీ ! రాముని శిరంబు నీపాదపద్మముల ముట్టుట కిదియే కడసారి (ఏడ్చును-తెఱలో) అబ్రహ్మణ్య మబ్రహ్మణ్యము.

రామ—ఓహో ! తెల్పు మేమిది ? (మరలఁ దెఱలో)

---

ఉమ్మలికము=దుఃఖము, కీలంబులు=మేకులు, చీరంబడి=పిలువంబడి, స్ఫురిత=చలించుచున్న, మేదుర=అతిశయమైన, అనుకంప=దయ, అబ్రహ్మణ్యము=అన్యాయము

క. యమునా తీర నివాసులు
సమితోగ్ర తపఃప్రభావ లసదాసులు దు
ర్దమ లవణ త్రాసితులై
శ్రమమునఁ జనుదెంచి రీవె శరణం బనుచున్. 51.

రామ—ఆహా! యిప్పటికిని రాక్షస త్రాసమా? అట్లగుఁగాక! కుంభీనసీపుత్త్రుఁడయిన యి దుర్దాత్ముని నున్మూలింప శత్రుఘ్ను నంపెదను. (కొన్ని పదము లరిగి మరలఁ దిరిగి) హా! దేవీ! ఇట్లు పోయి యెట్లుండఁగలవు? భగవతీ! విశ్వంభరా!

క. జనక రఘువంశ సంభవ
మనుకేంద్రుల యఖిలగోత్ర మంగళ మగు పా
వనశీల యైన యీ సా
ధ్విని యజ్ఞావసరమునందు వెలయించితివో? 52.

అట్టి పవిత్రపుత్త్రికయైన జానకి నవేక్షింపుము.

(నిష్క్రమించును.)

సీత—హా! సౌమ్య! ఆర్యపుత్త్ర! యెచ్చటనుంటివి? (వేగమున లేచి) కటకటా! దుస్స్వప్న వంచితనై యార్యపుత్త్ర శూన్యురాలినిగాఁ దలంచుచుంటిని. (పరికించి) అయ్యయో? నిద్రించుచున్న న న్నార్యపుత్త్రుఁ డొంటి విడిచి చనిరా. ఇప్పుడిదేమి? పోఁగాక! అతనిఁ గాంచుచు నాయంతనేను సమర్థురాలనేని యాతనిపై నాగ్రహింతును. సేవకు లెవ్వఁడిచ్చట?

దుర్ము—(ప్రవేశించి) దేవీ! "రథంబు సిద్ధమైనది. దేవియధిరోహించుఁగాక!" యని లక్ష్మణకుమారుండు విన్నవించుచున్నాఁడు.

సీత—ఇదిగో! అధిష్టించుచుంటిని, గర్భభాగము పరించు నట్లున్నది. కాన మెల్లనఁ బోవుదము.

దుర్ము—దేవీ! యిట్టిటు.

సీత—రఘువంశ దేవతలకు నమస్కారము, తపోధనులకు వందనము.

(అందఱు నిష్క్రమింతురు.)

చిత్రదర్శన మను ప్రథమాంకము.

సంపూర్ణము.

---

లవణత్రాసితులై=లవణాసురునిచే భయపెట్టఁబడినవారై, అవేక్షింపుము=కనిపెట్టుము. అవసరమునందు=యజ్ఞ (భూమియందు.)



# ఆంధ్రీకృతోత్తరరామచరిత్రము.

:O:

## ద్వితీయాంకము.

(తెఱలో) స్వాగతమా తపస్వినికి?

తాపసి—(పథికవేషముతోఁ బ్రవేశించి) ఆహా! ఈ వనదేవత ఫల కుసుమ పల్లవార్ఘ్యంబులతో నన్నుఁ జేరవచ్చుచున్నది.

వనదేవత—(ప్రవేశించి అర్ఘ్య మొసంగి).

ఉ. ఈవిపినంబు భోగ్యము యథేచ్ఛగ మీకు, శుభాహ మిద్ది, నా
కీనిధి సాధు సంగమున నెంతయుఁ బుణ్యమునన్ లభించు, వృ
క్షావళి నీడయైన, జలమైన, తపోవగభోజ్యమౌ ఫలం
బే? వనమూలమేని? వశవే గద సర్వము మీకు నిర్వ్యాజన్. 1.

తాప—ఇందేమి తెల్పవలయును?

మ. ప్రియమౌ కాయికవృత్తియున్, వినయ దీప్తింగల్గు వాచాప్రవృ
త్తియు, భద్రప్రకృతిం గనర్చు మతియున్, దివ్యంపు సాంగత్య ర
మ్యముఁ, బ్రత్యక్ష పరోక్ష కాలముల నేకీభూత సారస్యమున్
జయవెట్టన్ విలసిల్లు సజ్జన రహస్యం బచ్చు నిర్వ్యాజమై. 2.

(కూర్చుండుదురు)

వన—ప్రాజ్ఞురాలి నామధేయమును తెలిసికొందును!

తాప—ఆర్యురాలా! ఆత్రేయిని!

వన—ఆర్యా! ఆత్రేయి! యిప్పటి కెచ్చటినుండి వచ్చుచుంటివి? ఈ దండకారణ్యప్రచార మెందులకు?

---

అహము = దినము. ఏకీభూతము = ఒకటిగాఁ జేయఁబడిన, నిర్వ్యాజమై = మిషలేనిదై

ఆత్రే— గీ. వగలుదురు కుంభసంభవ ప్రముఖు లైన
పెక్కు రుద్గీథవేత్త లీ చక్కటులను
వీరి సన్నిధి నిగమాంత విద్య నేర్వఁ
దిరుగు చూటిని వాల్మీకి పరసనుండి. 3.

వన— అన్యమునులు స్వతముఁ బురాణ బ్రహ్మవాది యగు నా ప్రాచేతస మౌనిని నిగమాంతాధ్యయనంబున కై యుపాసించు చుండ నార్యారాలి కీ దీర్ఘ ప్రవాస క్లేశ మెందులకు ?

ఆత్రే— అచ్చట విశేష మగు నధ్యయనాంతరాయ మని దీర్ఘప్రవాస మంగీకరించితిని.

వన— అది యెద్ది ?

ఆత్రే— అమ్మహాత్ముని కెద్దియో యొకి దేవతా విశేషము సర్వవిధంబుల నద్భుతావహంబై స్తన్యత్యాగ వయస్సునం గలుగు నర్భక యుగ్మంబు నర్పించె. ఆయుగళ మొక్క మునులకే కాదు తిర్యగ్భూతములకు సైత మంతరంగంబులం ద్రవింపఁ జేయుచుండె.

వన— వారి యభిధానంబు తెలియుదువా ?

ఆత్రే— "కుశలవు" లని వారి నామధేయంబులును, తత్ప్రభావంబునుంగూడ, నా దేవతయే ఐకాంక్షించె.

వన— ప్రభావ మెట్టిది ?

ఆత్రే— వారికి సరహస్యంబు లయిన జృంభకాస్త్రంబు లాజన్మసిద్ధము లఁట.

వన— ఓహో ! ఆశ్చర్యమిది.

ఆత్రే— భగవానుఁ డగు వాల్మీకిమౌనియు, వారి నుపమాతృ తుల్యముగాఁ బోషించుచు సంరక్షించుచుఁ జూడాకర్మ నాచరించి నిగమములు దక్కఁ దక్కిన విద్యల సావధానముగా నేర్పి పిమ్మట గర్భైకాదశ వత్సరంబున క్షాత్రకల్పముతో నుపనయనం బొనర్చి గురువులు త్రయీ విద్యం గఱపిరి. జాజ్వల్యమాన ప్రజ్ఞా మేధా విశేషులగు నా బాలకులతో సహాధ్యయనం బొనర్ప నస్మదాదులకు యోగము లేదు. ఏమన ?

---

ఉద్గీథవేత్తలు=సామవేదము తెలిసినవారు, అర్భకయుగ్మము = ఇరువురుబిడ్డలు, ఉపమాత్స=పెంపుడు తల్లి. త్రయీ = వేదము.

చ. మొనసి గురుండు ప్రాజ్ఞునకు మూర్ఖునకున్ సరివిద్య నేర్పుచో
నొక్కనికిని జ్ఞానశక్తి గలుగన్, వెఱయి పను గాని కేయఁడా
జనులకుఁ బాండితీ కలనఁ జాల విభేదము గల్గు, బింబముఁ
గొను నెడ నచ్ఛ రత్నమునకుం దులఁ జూఁగునొకో మృదాదులున్. 4.

వస — ఇదే ! అధ్యయనాంతరాయము.

ఆత్రే — ఇంకొకటి గూడఁ గలదు.

వస — అదేది ?

ఆత్రే — పిదప నొకప్పుడా బ్రహ్మర్షి మధ్యాహ్న కాలమున దమసా తరంగిణిం జేరి యచ్చటం గవగూడి చరించు క్రౌంచంబులలో నొకటి కిరాతునిచే వధింపఁబడ నిరీక్షించి యాకస్మికావభాసరయై యసంకీర్ణానుష్టుబ్రూప యగు వాగ్దేవిం బ్రకటించె.

* శ్లో॥ "మానిషాద ! ప్రతిష్ఠాం త్వ మగమ శ్శాశ్వతీ స్సమాః
యత్క్రౌంచ మిథునా దేక మవధీః కామమోహితం" అని.

వస — చిత్రము. ఆమ్నాయంబు గాక నూతనంబుగా ఛందస్సు లవతరించినవి.

ఆత్రే — అయ్యెడ శబ్దబ్రహ్మావభాసకుం డగు భగవంతుని వల్మీకభవుని జేరి భగవంతుఁడగు భూతభావనుండు బద్మభవుం డిట్లనియె. "ఋషీంద్రా ! వాగ్బ్రహ్మంబునం బ్రబుద్ధుండ వైతివి. కాన రామచరిత్రంబు నభివర్ణింపుము, నీ ప్రతిభాదృష్టియే యనుపహతంబైన దివ్యజ్యోతి యగును. ఆదికవి వైతివి." అని యంతర్హితుం డయ్యె. పిమ్మట భగవానుఁ డగు వల్మీకభవుఁడు మనుష్యలోకమున శబ్దబ్రహ్మమునకుఁ బ్రథమ పరిణామ మగు నట్టి రామాయణ మను నితిహాసమును రచించెను.

వస — ఆహా ! బ్రహ్మాండ మలంకరింపఁబడినది.

ఆత్రే — కావుననే మహాంత మగు నధ్యయనాంతరాయ మని వచించితిని.

వస — అది యుక్తము.

ఆత్రే — విశ్రమించితిని. కల్యాణీ! యిప్పుడగస్త్యాశ్రమంబునకు మార్గంబుఁ దెల్పుము.

వస — ఇటు పంచవటి ననుసరించి యీ గోదావరీ తీరమున నరుగుదువుగాక !

---

అవభాసరయై = ప్రకాశము కలదియై, అసంకీర్ణ = వాక్యదోషరహితమైన,
* గీ. కామమోహితమైనట్టి క్రౌంచమిథున । మందునొకదాని జంపితి వట్టులేట । నో నిషాద ! పెక్కేండ్లు నిచర్యయందుఁ । బ్రాణములతోడ నుండఁగా గలదు సుమ్ము,
అనుపహతము = అడ్డులేని.

ఆత్రే — అన్నపుడు యశ్వమేధ మారంభించెను.

వాసం — ఇస్సీ! వివాహము గూడనా ?

ఆత్రే — లేదు లేదు. పాపము శాంతించుంగాక !

వాసం — అట్లయిన యాగమున ధర్మపత్ని యేది ?

ఆత్రే — హేమమయం బగు సీతాప్రతికృతి.

వాసం — అన్నా !

క. కులిశమునకన్నఁ దీక్ష్ణం
బులు, సుమమునకన్న మృదులములు, వసుధ నిలన్
వెలయు మహాత్ముల చిత్తం
బుల నెవ్వనికైనఁ దెలియఁ బోలునె తలఁపన్. 6.

ఆత్రే — వామదేవాభిమంత్రితం బైన యజ్ఞాశ్వంబు విసర్జింపఁ బడియె. దానికి విధివిహిత క్రమంబున రక్షక వర్గ మేర్పఱుపఁ బడియె. దానికధీశుఁడై లక్ష్మణ కుమారుఁ డగు చంద్రకేతుండు దివ్యాస్త్ర సంప్రదాయము తోడను జతురంగ సేనతోడను బంపఁబడియెను.

వాసం — (స్నేహానంద బాష్పములతో) కుమార లక్ష్మణునకుం గూడఁ బుత్త్రుఁడా? ఆహా! తల్లీ! బ్రదికితిని.

ఆత్రే — ఇంతలో నొక మహీసురుండు మృతుఁడైన పుత్త్రుని నెత్తుకొని రాజద్వారమున గుండెలు మోదుకొనుచు "అబ్రహ్మణ్య" మని మొఱపెట్టెను. పిదప "రాజాపచారము లేక లోకుల కిట్టి యకాలమృత్యు వావేశింప" దని దయామయుం డగు రామభద్రుఁ డూహించుచుండ నశరీరవాణి యొక్కెడ నిట్లావిర్భవించె

గీ. "భూతలంబున నిపుడు శంబూకుఁ డనఁగ
వృషలుఁ డొకరుఁడు తపమాచరించుచుండె
శిరము ఖండింప నర్హుఁ డన్నరుఁడు నీకు
రామ! వానిని ద్రుంచి విప్రసుతు మనుపు." 7.

ఇయ్యుపశ్రుతి నాలించి ఖడ్గహస్తుండై పుష్పక విమాన మధిష్ఠించి శూద్రతాపసాన్వేషణార్థమై జగద్విభుం డక్షిణకూలం బరుగఁ జొచ్చె.

---

కులిశము = వజ్రాయుధము, వృషలుఁడు = శూద్రుఁడు.

వాసం—శంబూకుఁ డనువాఁ డధోముఖుఁడై ధూమపాన మొనరుచుచు నిజనస్థానమున నే తపము సేయుచుండెను. కాన మనరామభద్రుఁ డీకాననం బలంకరించుఁ గాఁబోలు !

ఆత్రే—కళ్యాణీ ! యింకఁ బోయెదను.

వాసం—పోఁగాక ! ఈదినము కఠోరముగా నున్నది. అల్లదే ;—

మ. పులుఁగుల్ వట్టలఁ గాలఁ గీఱుచును బుర్వుల్ ముక్కుల న్మెక్కఁ బ
క్కలఁ బారావత కుక్కుటంబులు తృషం గాసిల్లి ఘోషింప, నొ
డ్డుల నీడద్రుమముల్ తపోష్మమునఁ బట్టుల్ దప్పి మత్తద్విపం
బులు తెంకెకులల రాయ రాలు పునులం బూజించె గోదావరిన్. 8.

(నిష్క్రమించిరి.)

ఇది విష్కంభము.

(కరుణోద్యత ఖడ్గముతో రాముఁడు ప్రవేశించును.)

రామ—

న. మగుడకుదక్షిణోద్ధకరమా ! మృతభూసుర నందనుండు హా
చ్చుగఁ దెలివొందిని నిల్చుటకు శూద్రమునిం గడతేర్పు మక్కటా !
వగ పొక యింత లేక కులభామిని గర్భవతిన్ వనావళిం
గగిచిన రాము గాత్రమవు నీకు దయారస మేల కల్గునో ? 9.

(అతికష్టమున విసరి) రాముననుఁ దగిన కృత్య మాచరింపఁ బడినది. జీవించునా విప్రకుమారుఁడు ?

దివ్యపురుషుఁడు—(ప్రవేశించి) దేవా ! జయము జయము !—

న. యముని నశంబునుండి యభయంబు నొసంగిన నీ ప్రశాసక
స్త్వము వహించుటన్ మనిగె బ్రాహ్మణ నందనుఁ, డిట్టి వైభవం
బమరెను నాకు, శంబుకుఁడ నోఁడల మ్రొక్కెద నీ పదాంబుజ
న్మములకు, సజ్జనాప్త నిధనంబులు గూడఁ దరింపఁ జేయవే ? 10

కఠోరము=తీక్ష్ణము. తృష=దప్పి, నీడ=గూళ్లతో నున్న, ద్రుమముల్=వృక్షములు, తపోష్మమున=ఎండవేడిమిచే, ద్విపములు=ఏనుఁగులు. దక్షిణోద్ధకరమా=ప్రసిద్ధమైన మోకుడిచేయీ ! గాత్రమవు= అవయవరూపమైనదానవు. పదాంబుజన్మములు=పాదపద్మములు. నిధనంబులు=శాపములు.

రామ—రెండును మాకు హితములే, కాని సుగ్రహసంబునకుఁ దగిన ఫలం బనుభవింపుము.

గీ. ఎచట సుకృతంబుచే జనియించి నట్టి
విపుల మోద ప్రమోదముల్ వెలయుచుండు
నట్టి వైరాజలోకంబు లతుల దీప్తి
భరితములు గల్గు నీకు శాశ్వతము లగుచు. 11

శంబు—ఈ వైభవము దేవర పాదానుగ్రహ ఫలంబుగాని నా తపఃఫలంబుగాదు. అయినను తపంబు మహోపకారమే కావించెను.

న. హరి జగ మారయం దగిన భూతవిభుండవు నీవు శూద్రుడు న
న్నరయుచు నూరు యోజనము లాస్తమెయిం జనుదెంచు టెల్ల స
త్కృప కగు మత్తపః ఫలము గాదె? ప్రశీతానన! కాకయున్న ని
ష్కారణ మయోధ్యనుండి నను గాంచుట యెక్కడ దండకాటవిన్? 12.

రామ—దండకారణ్యమా యిది? (కలయఁ గాంచి) ఔను—

ఉ. ఒక్కెడ నీల కోమలము, లొక్కెడ భీషణ జాంగలంబు లిం
కొక్కెడ నిర్ఝరారవ మహోజ్జ్వల సర్వ దిశాముఖంబు, లీ
ప్రక్కలఁ దీర్థముల్, గిరులు, వాహినులు, న్నాశ్రమ గర్భితాటవుల్,
నెక్కొనఁ బూర్వదృష్ట సరణిం గనుపట్టెడి దండకాస్థలుల్. 13.

శంబు—దండకారణ్యమే యిది. తొల్లి యిట నివసించు దేవరచే—

గీ. దారుణాచారు లగు చతుర్దశ సహస్ర
దితిజులును, ఖరదూషణ త్రిశిరు లనెడి
రాక్షస త్రయమును మహారణమునందుఁ
జంపఁ బడరేదె విశ్రుతోచ్ఛ్రయము మెఱయ? 14.

కావుననే సిద్ధక్షేత్రమగు నీ జనస్థానమున మావంటి భీరువులకుఁ గూడ నిర్భయ సంచారము లభించినది.

---

వైరాజలోకంబులు=ప్రకాశవంతములైన లోకములు. జాంగలంబులు=ఎడారులు, నిర్ఝరారవ= ప్రవాహధ్వనులు. పూర్వదృష్టసరణిన్=వెనుకఁజూచినరీతిని. చతుర్దశసహస్రదితిజులు=పదునాలుగు వేలరక్కసులు. విశ్రుతోచ్ఛ్రయము=పరాక్రమాతిశయము. భీరువులకు=పిరికివారికి.

రామ—దండకారణ్యమే కాక జనస్థానముం గూడనా?

శంబు—కాను. సర్వభూత భయకరంబులు, సుస్మృత చండ శార్దూల కరాళ శైల కందరంబులు, నగు నీ జనస్థాన ప్రాంత గంభీర కాంతారంబులు దక్షిణ దిగంతంబు నావరించి యున్నవి. అల్లదే!

మ. ఒకచో నీరవ నిశ్చలంబు, లొకచో నుద్ఘుష్ట సత్త్వంబు, లిం
కొకచో స్వైర సుషుప్త ధీర రవ నాగోచ్ఛ్వాస దీప్తాగ్ను, లిం
కొకచోటం బ్రదరాంతర ప్రసర దల్పాంబులం దా సీమలం
గృకలాసంబులు తృష్ణవాహస నిదాఘోరమ్ములం గ్రోలెడున్. 15.

రామ— గీ. తొల్లి ఖరదైత్య నిలయమై తుఁగలించు
యీ జనస్థాన వనసీమ లెల్లఁ గనుచుఁ
గొంటి వృత్తాంతముల మహాద్భుత మెసంగ
ననుభవించుచు నుంటిఁ బ్రత్యక్ష సరణి. 16.

(అంతటఁ గలయం జూచి) సర్వదిగంబులను జానకి యుపవనామోదిని; అవియే కదా యీ కాంతారంబులు! ఇంతకన్న భయంకర మెయ్యది? (కన్నీళ్లతో)

క. నిను గూడి మధుసుగంధిల
వనముల నివసించు ననుచుఁ బరమానందం
బున విహరించె ఫణిమణి
యను నగు దత్ప్రియయ మిగుల మచ్చిది గాదే? 17.

క. ఇంచుకయుఁ జేయకున్న య
ద్రుంచుక్ సౌఖ్యములచేత దుఃఖము లెల్లం
శాంతించఁ బ్రియాజన మనఁగా
పెంచఁగరా దట్టి ద్రవ్యమిల మనుజునకున్. 18.

---

కరాళ=భయంకరమైన, నీరవ=నిశ్శబ్దముగుటచే, ఉద్ఘుష్ట=ప్రచండమైన, సత్త్వంబులు = జంతువులు, స్వైరసుషుప్త = స్వేచ్ఛగా నిద్రించుచున్న, ధీరరవ = గంభీరధ్వనిగల, నాగ = పాముల యొక్క— ఉచ్ఛ్వాసముచేత, దీప్తాగ్నులు=మండెడు అగ్నిహోత్రములు. ప్రదరాంతర = గహ్వరముల నడుమ, ప్రసరత్ = పారుచున్న, అల్పాంబులో = కొద్దినీరుగల, సీమలన్=ప్రదేశములందు, కృకలాసంబులు=తొండలు, తృష్ణన్=దాహముచే, వాహస=కొండచిలువల యొక్క, నిదాఘోరమ్ములన్ = చెమట నీటిని. గ్రోలెడున్, మధుసుగంధిల=పూవుల తావిచే బరిమళించుచున్న, [illegible]

శంబు.—కావున దురవగాహంబు లగు నీ గహనంబులం జూడ వలదు. మఱియు, సదమల నీలకంఠ కంఠ మంజుల పరిభా భాసురంబు లగు భూధరంబులచే వ్యాప్తంబులై, నిరంతర రాజిల విస్తృత చ్ఛాయా బాలతరు బృంద సుందరంబులై, నిర్భయానేక మృగ సంకులంబులై పరిణామ తామిత పరిణాహంబు లగు నీ మధ్యమారణ్యముల మహాత్మా! కనుంగొనుము.

గీ. సమద విహంగ నిలయ వేతస ప్రసూన
గంధి శీతల విమలోదకముల నలరి,
మంజు ఫల నీల జంబూ నికుంజ రుద్ధ
రయ రవంబులఁ బాఱు నిర్ఝరిణు లిచట. 19.

మఱియు—

గీ. గుహల నంబూత్కృతము సేయు కూనయేనుఁగు
ల నినదంబు ప్రతిధ్వనుల మిగుల మీఱె,
గజ దళిత కీర్ణ సల్లకీ గ్రంథి సార
సౌరభము రేగె శిశిర కషాయ కటుతర. 20.

రామ.—(కన్నీళ్లు నరికట్టి) భద్రా! నీ మార్గములు శుభప్రదము లౌఁ గాక! పుణ్యలోక ప్రాప్తికై విమానంబు నధిరోహింపుము.

శంబు.—పురాతన బ్రహ్మవాది యగు నగస్త్యమౌని కభివందించి శాశ్వత స్థానముం జేరెదను. (నిష్క్రమించెను.)

---

దురవగాహంబులు=ప్రవేశింపశక్యము గానివి, గహనంబులు=వనములు, విస్తృత=విరివి యైన, నీలకంఠ=నెమళ్ల యొక్క, పరిణాహంబులు=గంభీరములు.

సమద=మదించిన, విహగ=పక్షుల యొక్క, నిలయ=గూళ్ళుకల, వేతస=ప్రబ్బచెట్ల యొక్క, ప్రసూన=పూవులచేతను, గంధి=పరిమళించు, శీతల=చల్లనైన, విమల=స్వచ్ఛమయిన, మంజు=మృదువైన, ఫల=పండ్లచేత, నీల=నల్లనయిన, జంబూనికుంజ=నేరేడుపొదలచేత, రుద్ధ=అరికట్టఁబడిన, రయ=వేగమువలనఁగలుగు, రవంబుల=ధ్వనులతో, పాఱు=ప్రవహించు, నిర్ఝరిణులు=ప్రవాహములు.

అంబూత్కృతము=ఉమ్మి వేయుటవలనఁగలుగు ధ్వని. గజ=యేనుఁగులచేత, దళిత=విఱువఁబడిన, కీర్ణ=దట్టమయిన, సల్లకీ=అందుగుచెట్ల యొక్క, గ్రంథి=గణుపులనుండి వెడలిన, సార=రసము యొక్క, సౌరభము=పరిమళము, శిశిర=చల్లనిదియును, కషాయ=చేదయినదియును, కటుతర=కారముగలదియునై, రేగెన్.

రామ— గీ. మున్ను జిరకాల మెందు గాపుర మొనర్చి
వన్య గృహమేధులము ధర్మ పరుల మగుచు
నేము సంసార సుఖరసం బెఱిఁగినాఁగ
మట్టి వన మిప్పు డీక్షింప నయ్యె మరల. 21.

గీ. మొరయుచు సెమిగుల కొప్పు భూధరము లవియె!
ప్రమద హరిణంబు లగు వనస్థలము లవియె!
మంజు వంజుల లతికా సమంచితములు
తరుణ నీప నిచుళ సరిత్తటము లవియె! 22.

క. జలధర మాలికవలె ని
ష్ఫాలకుం బ్రస్రవణ దివ్య భూధర మదియే
తెలియంబడుఁ; గోదావరి
యొలమిం బ్రవహించు నవటనే నిర్మలయై. 23.

చ. ఉరు వగు దీని శృంగమున నుండె గృధ్రాలయంబు; దాని క్రింద సు
స్థిరముగఁ బర్ణశాలల వసించితి మేమును; గౌతమీపయ
స్త్వరిత విశాల రుగ్వితత భూరుహ శోభఁ దనర్చు పక్షిన
స్వరుతములన్ ధ్వనించు వనవీథుల బంధురమైన సీమలన్. 24.

ఇచ్చట నె పంచవటి. ఇందుఁ జిరకాల ముండుటం బట్టి యీ ప్రదేశంబు లన్నియు వివిధ విస్రంభ విహారములకు పాత్రలై యున్నయవి. ప్రియురాలి ప్రాణసఖి వాసంతియు నిచ్చటఁ గలదు. కాన నిప్పటి రామునిహితకున నేమి కానున్నదో? ఇప్పుడు—

---

గృహమేధులము=గృహస్థులము.

మంజు=మృదువైన, వంజుల లతికా=ప్రబ్బ తీగలచే, సమంచితము=ఒప్పినవియు, తరుణ=లేఁతవగు, నీప=కడిమిచెట్లును, నిచుళ=ఎఱ్ఱగన్నేరుచెట్లును గలిగిన సరిత్తటములు=ప్రవాహపుటొడ్లు. అవియె.

జలధరము=మేఘము. గౌతమి=గోదావరి యొక్క, పయః=ఏటిచేత, త్వరిత=కదల్పఁబడిన, విశాల=మిక్కిలి సల్లనగు, రుక్=కాంతి గలిగిన, వితత=విశాలమగు, భూరుహ=వృక్షముల యొక్క, శోభఁ దనర్చు, పక్షివత్=పక్షుల యొక్క, విరుతములన్=కూతలనే, విస్రంభ=ప్రణయసంబంధముగ.

మ. ఘన కాలంబునకున్ మెయి న్వీరసి తీక్ష్ణంబౌ విషం బట్లు, నూ
తన సంఘాతమునం జలించు వికటోద్య చ్ఛల్య ఖండంబు నా
గను, హృన్మర్మమునం బ్రభిన్న మగు నా గ్రంథివ్రణం బట్లు, ప్రా
క్తన శోకంబు నవీనమై మరల న న్గారించు నుద్వేలతన్. 25.

అట్లయినను బూర్వ పరిచితంబు లగు ఈ భూభాగంబులం గనుంగొందును. (పరికించి) ఓహో ! ధరణీసంస్థాన మెంత విపర్యస్తమైనది.

మ. తొలుతన్ వెల్లువయేడనో పులిన మాదుం దోఁచె నిమ్నాగులం,
దలవృక్షంబుల సాంద్రతా విరళతల్ వ్యత్యాసముం జెందె, నిం
డలి కానం జిరకాలమై కనుట నన్యం బట్లు గాన్పించె, ని
శ్చల శైలంబులచే నదే యిదని సాక్షా న్నిశ్చయం బయ్యెడిన్. 26.

అన్నా ! పరిత్యజించు చున్నను న న్నీ పంచవటీ స్నేహము బలవంతముగా నాకర్షించు నట్లున్నది. (దైన్యముతో)

చ. అల సతిఁ గూడి యే నెచట నాదినముల్ సుఖియించినాఁడ, మ
న్నిలయమునం దజస్రము యదీయకథల్ వితతంబు లయ్యెఁ, దొ
య్యలి నెడఁబాసి యొంటియగు నా దురితాత్ముఁడు రాముఁ డిప్పు డ
గ్గల మగు నట్టి పంచవటిఁ గాంచు నెటుల్ ? గనకేగు నెట్టులన్. 27.

శంబు—(ప్రవేశించి) దేవర జయించుఁగాక ! దేవా ! భగవానుఁ డగు నగస్త్యమౌని నావలనఁ దమ సన్నిధానమును విని, "వత్సల యగు లోపాముద్రయు నగస్త్యాశ్రమ వాసు లందఱును విమానావతరణ మంగళం బాయత్త పఱచి సిద్ధమై నిరీక్షించియుండిరి. కాన విచ్చేసి మమ్ము మన్నింపుము. పిమ్మట జవనపుష్పకంబున స్వదేశమున కరిగి యశ్వమేధమునకు సన్నద్ధుండ వగుదువు" అని మీకానతిచ్చె.

రామ—భగవదాజ్ఞ నిర్వర్తింతును.

శంబు—అట్లయిన దేవర పుష్పకము నిట్లు మరలించుఁగాక !

---

సంఘాతమునన్=దెబ్బచేత, చలించు=కదలు, వికట=వ్యత్యస్తమయిన, ఉద్యత్=అతిశయమయిన, శల్యఖండంబు=బాణముయొక్కతునుక. ప్రాక్తన=పురాతనమైన, ఉద్వేలతన్=అగ్గలమయి. గ్రంథివ్రణము=కంతివలెకఠినమైనవ్రణము.

వెల్లువ=ప్రవాహము, పులినము=ఇసుకతిన్నె. సాంద్రతావిరళతల్=దట్టము పలుచన. అజస్రము=ఎల్లప్పుడు, యదీయ=దేనిసంబంధమైన, వితతంబులు=వ్యాప్తములు

రామ—భగవతీ ! పంచవటీ ! శిష్టజనానుసరణంబున నిన్ను రాముఁడు క్షణమాత్ర మతిక్రమించుచుండె. సైరింపుము.

శంబు—దేవా ! చూడుము చూడుము !

మ. అల కుంజంబుల ఘూకఘూత్కృతులు మెండౌ కీచకస్వానముల్
వోలయం గిమ్మనకుండు వాయసములం బొల్పారెఁ గ్రౌంచావతం;
బెలమిం గేరు నెమిళ్ల కేకలకు నెంతే జంకి వ్యాళంబు ల
గ్గలికం జుట్టెఁ బురాణ చందన తరు స్కంధంబులం దిగ్గిరిన్. 28

మ. అలవే ! దక్షిణ భూధరంబు లధిరూఢాంభోధరోద్యత్ప్రభా
కులశృంగంబులు; కందరోద్ధత నదద్గోదావరీ తోయముల్,
కలితాన్యోన్య విఘాత సంకుల చలత్కల్లోల కోలాహలం
బు లివే ! భీమ గభీర వారి ఝరముల్; పుణ్యాపగా సంగముల్. 29

(అందఱు నిష్క్రమింతురు)

పంచవటీప్రవేశమను
ద్వితీయాంకము,
సంపూర్ణము.



కుంజంబులు=పొదరిండ్లు, ఘూక=గుడ్లగూబలయొక్క, ఘూత్కృతులు=ధ్వనులు, కీచకస్వానముల్ = బొంగువెదుళ్ళధ్వనులు. వాయసములు=కాకులు, కేరు = సంతోషించు, వ్యాళములు = పాములు, స్కంధము = మ్రాను.

అధిరూఢ = అధిష్ఠించిన, అంభోధర = మేఘములయొక్క, ఉద్యత్ = అతిశయమున, ప్రభా = కాంతిచేతను, ఆకుల = కూడుకొనిన, శృంగంబులు = శిఖరములు. కందర = గుహలనుండి, ఉద్ధత = బయలువెడలిన, నదత్=ధ్వనిచేయుచున్న, గోదావరి యొక్క, తోయముల్=ఉదకములు కలిత=కూడుకొనిన, అన్యోన్య=పరస్పరముగు, విఘాత = తాకుడులచేత, సంకుల = వ్యాప్తమై, చలత్ = కదలుచున్న, కల్లోల = తరంగములయొక్క, కోలాహలంబులు = కలకలధ్వనులు, భీమ = భయంకరమైన, గభీర = లోతయిన, వారి = ఉదకముయొక్క, ఝరముల్ = ప్రవాహములు; పుణ్య = పవిత్రమయిన, ఆపగా = నదులయొక్క, సంగముల్ = కలయికలు.



# ఆంధ్రీకృతోత్తర రామచరిత్రము.

## తృతీయాంకము.

(తమస, మురళ, అను నదీద్వయము ప్రవేశించును.)

తమ—సఖీ! మురళా! తొందర గలదానివలె నుంటివేమి?

ముర—భగవతీ! తమసా! తరంగిణీమణి యగు గోదావరి కెఱింగింప నగస్త్యభగవానుని సధర్మిణియగు లోపాముద్రచే నంపఁబడితిని. "ఎఱుఁగుదువుగదా! సతీపరిత్యాగము మొదలు."

క. వెలువడ నట్టి గభీరత
వలనన్ మది డాగియున్న బహుళ వ్యథచేఁ
గలఁగి పుటపాకగతి రా
జిలు రాముని కరుణ రసము జృంభిత మగుచున్. 1.

అట్టి యిష్టజనముం గష్టముల పాలుజేయుటం బట్టి ఘనీభవించిన దీర్ఘ శోకమున నిపుడు రామభద్రుండు మిగులఁ బరిక్షీణుఁ డయ్యె. వానిఁ గాంచి నా నెమ్మనం బురియాడు చున్నట్లున్నది. ఇప్పుడు మరలి పోవు రామభద్రుండు పంచవటీ వనంబునఁ బ్రియా సహ విహార సాక్షులగు రమ్యప్రదేశములం దప్పక చూడఁ గలఁడు. అందు స్వభావ ధీరుం డైనను రామభద్రున కిట్టి యవస్థ యం దతి విపుల శోకావేగ సంక్షోభంబున నడుగడుగున మహాప్రమాదంబు లూహింపఁ దగి యుండును. కాన భగవతీ! గోదావరీ! నీవు జాగరూకురాలవై యుండ వలయు.

---

జృంభితము=విస్తారము,

గీ. జలజ కేసర సురభులై జల లవముల
మలపు శీతల వీచికా మారుతములఁ
గొల్లలుగఁ జల్లి పెల్లు మూర్ఛిల్లు వేళ
రామభద్రుని జీవంబు నోము'' మనుచు. 2

తమ—యుక్తమే స్నేహమునకుఁ బ్రియజనానువర్తనము. జీవనోపాయము మాత్రము ముఖ్యమయినదే యిపుడు తారసిల్లినది.

ముర—ఏమది ?

తమ—వినుము. తొల్లి వాల్మీకి తపోవన ప్రాంతమునఁ బరిత్యజించి లక్ష్మణుండరుగ జానకీదేవి ప్రసవ వేదనాక్రాంత మగు దేహమును బ్రబల దుఃఖోద్వేగమున గంగాపూరంబునం దర్పించె. అం దప్పుడే డింభక యుగ్మంబునుం గని భగవతు లగు ధరణీ భాగీరథులచే ననుగృహీతయై రసాతలంబునం జేర్పఁబడియె. పిదప జాహ్నవీదేవి స్తన్యత్యాగ ప్రాయమున నా డింభక ద్వయమును వాల్మీకిమౌనికిఁ దనయంత నర్పించినది.

మర—(ఆశ్చర్యముతో)

క. ఏరొండ నీదృశ జనము స
హాయం బొనరించు నట్టి యనఘాత్ముల కొ
నాయత దుర్దశయైనం
జేయుం బరమాద్భుతంబు జింతింపంగన్. 3.

తమ—ఇప్పు డీ శంబూకవృత్తాంతంబున జనస్థాన సమాగతుం డగు రామభద్రుని సరయూముఖంబున విని భగవతి యగు భాగీరథియుఁ బ్రేమమున లోపాముద్ర తెలంగుననే యూహించి సీతాసమేతయై యెద్దియో గృహాచార మిషంబున గోదావరిం జూడ నరుగుదెంచె.

మర—“రాజధానియం దుండి జగదభ్యుదయ బీజంబు లగు తత్తత్ప్రయోజనంబులం బ్రవర్తించు రామభద్రునకు వినోదంబు లేర్పడి యుండును. నిర్వ్యాపారుఁడై శోకమాత్ర సహాయుఁడైన వీనికిఁ బంచవటీ ప్రవేశము మహానర్థ'' మని భగవతి

---

జలజ=పద్మములయందలి, కేసర=కింజల్కములచే, సురభులై=పరిమళించునవియై. జలలవముల=నీటితుంపురులను. మలపు=మరలించు. డింభకయుగ్మము=ఇద్దఱుపిల్లలు. రసాతలమున=పాతాళమున. సమాగతుండగు=వచ్చిన.

లెస్సగా పోషించినది. కాని యిపుడు జానకీదేవిచే రామభద్రుఁ డెట్లాదరింపఁ బడును?

తమ— ఇట్లు భగవతి భాగీరథి పల్కినది. "వత్సా! యజ్ఞభూనందినీ! సీతా! ఇప్పు డాయుష్మంతు లగు కుశ లవులకు ద్వాదశ వర్ష సంఖ్యా బోధకం బగు మంగళ గ్రంథిని బంధింపఁబడును గాన నీపురాతన శ్వశురుండు, నిదమకం గల మానవ రాజర్షి వంశమున నుత్పాదకుండును, గలుష సంహారకుండును నగు దేవుని భానుమంతుని స్వహస్తాపచితంబు లగు ప్రసూనంబుల నారాధింపుము. ధరణీతల చారిణి వగు నిన్ను మా ప్రభావంబున వనదేవతలు సయితముఁ గనుంగొనఁ జాలరు. మర్త్యులం బల్కనేల"? అని మఱియు, "తమసా! వధు వగు వత్స జానకి నీయెడలఁ బరమ ప్రేమ గలది. కాన నీవే దానికి సహచారిణివి గ"మ్మని నాకాన తిచ్చె. ఇప్పుడామె యాజ్ఞ ననుసరింతును.

ముర— నేనీ వృత్తాంతమును లోపాముద్రతో నివేదింతును. రామభద్రుండు నేతెంచె ననియే తలంతును.

తమ— ఇదే! గోదావరీ హ్రదంబునం బయలుదేరి—

గీ. ఎల్లెడల వెల్లనై చిక్కఁ గల్లములును,
కెదరు కురులను బొదలాడు వదన మొదవఁ,
గరుణ మూర్తియొ? మెయిదాల్చు విరహరసమొ?
నాఁగ జనకేంద్ర పుత్త్రి కాననముఁ జేరె. 4.

ముర— ఇదిగో!

ఉ. హృదయ సుమంబు వాడునటు లేచెడు దారుణ దీర్ఘ శోక మిం
పొదవెడు వృంతముం దొలఁగి యున్న ప్రవాళముఁ బోలె నెండి వె
ల్లదనము నొందు దీని మెయి గ్లాని వహింపఁగఁ జేయుచుండె, భం
గద మగు శారదోష్మమిల కైతక గర్భ దళంబు పోలికన్. 5.

(పరిక్రమించి నిష్క్రమించిరి.)

విష్కంభము.

---

పురాతనశ్వశురుఁడు=వృద్ధుఁడగుమామ, ఉత్పాదకుఁడు=కారణభూతుఁడు. భానుమంతుని= సూర్యుని, అపచితంబులగు= కోయఁబడిన, వధువు=కోడలు, నివేదింతును=చెప్పెదను, గల్లములు=చెక్కిళ్లు, గ్లాని=కృశత్వము, శారదోష్మము= శరత్కాలపు వేఁడిమి, కైతకగర్భదళము=మొగలిపొత్తిలోని రేకు. ప్రవాళము=చిగురు

(తెఱలో) "ప్రమాదము ప్రమాదము.

[పుష్పములఁ గోయుచుఁ గరుణౌత్సుక్యములతో వినుచు సీత ప్రవేశించును]

సీత—ఓహో ! రెండుంగుదును. నాప్రియసఖి వాసంతి పలుకుచున్నది.

(మరలఁ దెఱలో)

చ. "అవనిజ సల్లకీ కిసలయంబులఁ గేల నొసంగ లోలతం
జవిగొని ప్రోల నే ద్విరద శాబము మున్ను ప్రవృద్ధిఁ జెందెనో"?

సీత—దానికేమి?—

(మరలఁ దెఱలో)

"కవగొని కాంతతోడ జలకంబు గొనరుచు నుండ దాని బల్
జవమున నొక్క కుంజర లలామ మెదురొక్కనెఁ జెంత నుద్ధతిన్. 6

సీత—(తొందరతోఁ గొన్ని యడుగులు నడిచి) ఆర్యపుత్త్రా ! నాపుత్త్రకునిరక్షింపు రక్షింపు. (స్మృతినభినయించి దైన్యముతో) కటకటా ! చిరపరిచితంబు లగు నయ్యక్షరంబులే పంచవటీ దర్శనంబుచే మరల మందభాగ్యురాల నగు నన్ననుసరించు చున్నవి.—హా ! ఆర్యపుత్త్రా ! —(మూర్ఛిల్లును.)

తమస—(ప్రవేశించి) వత్సా ! ఊరడిల్లు మూరడిల్లుము.

(తెఱలో) "విమాన రాజమా ! యిచ్చటనే నిల్వుము."

సీత—(ఊరడిల్లి భయోల్లాసములతో) ఓహో! జలధర వలాహక రణిత గంభీర పీవరం బైన యీ భారతీ నినాద మెచ్చటిది ! (శ్రవణ వివరంబులం జొచ్చి) మంద భాగ్యురాల నగు నన్ను గూడ గొబ్బున నూరడించు చున్నది.

తమ—(స్నేహ బాష్పములతో) ఓవత్సా !

క. ఎచ్చటి నుండియొ కిలరూ
పచ్చుసడక వచ్చు నినద మందున నిట్టే
వెచ్చగు గర్జకు నెమ్మిలి
మచ్చున నౌత్సుక్య శీలి మరగెద వేమో ? 7

ఔత్సుక్యము = సంతోషము, సల్లకీకిసలయంబుల = అందుగుచిగుళ్ళను, లోలతన్ = ఆసచే, ద్విరదశాబము = పిల్లయేనుఁగు, కుంజరలలామము = శ్రేష్ఠమైనయేనుఁగు, జలధర = నీటితోనిండిన, వలాహక = మేఘమువలె, రణిత = ధ్వనిచేయుచున్న గంభీరమైన—పీవరంబైన = బలిసిన, భారతీనినాదము = వాగ్ధ్వని, గర్జకునెమ్మిలిమచ్చున = ఉఱుము వినిననెమలివలె.

సీత—భగవతీ ! ఇట్టుం బలికెద వేమి ? ఈ స్వరశైలి నే నెఱుంగుదును. ఆర్య పుత్త్రుఁడె పలుకుచున్నాఁడు.

తమ—"తపస్వి యగు శూద్రుని దండింప నైక్ష్వాకభూపతి జనస్థానమున కేతెంచె" నని వింటిని.

సీత—సంతోషము ! ఆరాజు రాజధర్మముం బరిత్యజింప లేదుగదా !

(తెరలో)

ఉ. "[1]ఏ వలనన్ మృగద్రుమము లెల్లను నాహిత బంధువర్గమా ?
నే వలనం బ్రియం గలిసి యెన్నొకాలంబు వసించినాఁడ ? నా
నావిధ నిర్ఝరంబులఁ గనంబడి, కందర రాజి నొప్పి, గో
దావరిపొంతె నున్న సహ్యనగ రమ్య తటంబు లివ్వియే ! 3

సీత—హా ! యెట్లు ప్రత్యూష వేళను మంచు నాపాండురంబై పరిక్షీణ దుర్బలం బగు నాకారంబు గల్గి గంభీర ప్రభావ మాత్రంబుచేఁ బ్రత్యభిజ్ఞాతుఁ డగు నార్యపుత్త్రుఁడే; కాన నన్నాదుకొనుము. (తమసం గౌఁగిలించి మూర్ఛిల్లును)

తమ—(పట్టుకొనుచు) వత్సా ! ఊరడిల్లు మూరడిల్లుము.

(తెరలో) "ఈ పంచవటీ దర్శనంబున—

గీ. హృత్తలంబున లీనమై యిపుడు ప్రబల
మగుచు జ్వలియింపఁ బోవు దుఃఖాగ్ని నొదువు
ధూమ విసరంబు వోలెను ద్దామభంగి
నావరించుచు నుండె మోహంబు నన్ను. 9

హా ! ప్రేయసీ ! జానకీ !

తమ—(తనలో) ఇదియె గురుజనం బూహించినది.

సీత—(ఊరడిల్లి) హా ! యెట్టిది

(తెరలో) "హా ! దేవి ! దండకారణ్యవాస ప్రియసఖి ! విదేహరాజపుత్త్రి !"

(మూర్ఛిల్లును.)

---

[1]ఏవలనన్ = ఎచ్చట, మృగద్రుమములు = మృగములు, చెట్లు, ఆహితబంధువర్గమా = బంధుసముదాయముగాఁ జేయఁబడెనో ? నిర్ఝరంబులన్ = ప్రవాహములను, కందరరాజిన్ = గుహాసమూహముచే, ప్రత్యూష = ప్రాతఃకాలమందయిన, ఇందుమండలము = చంద్రబింబము, ఆపాండురంబయి = తెల్లబడి, ఒదువు = క్రిమ్ము.

సీత—ఇశ్శీ! మందభాగ్య నగు నన్నుచ్చరించి నిమీలిత నేత్రోత్పలుండై యార్యపుత్త్రుండు మూర్ఛిల్లె. హా! గొట్టె! భూతలంబున నుత్సాహంబు దక్కి దుస్సహంబుగా నొరగి పడియె. భగవతీ! తమసా! రక్షింపు రక్షింపు. ఆర్యపుత్త్రుని బ్రదికింపుము.

(పాదముల నొరఁగును.)

తమ— క. బ్రతికింపుము నీవె జగ
త్పతి నో కల్యాణి! నిదుపాణితలంబే
హితసంస్పర్శం బగు; నీ
వితత ప్రాభవము గల్గు దాన వినియత భంగిన్. 10

సీత—ఏమయిన నగుఁ గాక! భగవతి పల్కినట్లే చేయుదును.

(తొందరతో నిష్క్రమించును.)

(పిదప భూపతితుఁడై సబాష్పయగు సీతచే స్పృశింపఁబడి సంతోషధైర్యములతో, రాముఁడు ప్రవేశించును)

సీత—(సంతోషముతోఁ దనలో) త్రైలోక్య నాథుని జీవితము మరల వచ్చినది.

రామ—ఓహో! యేమిది?

మ. వర హరిచందనాభినవ పల్లవ జాత రస ప్రలేపమో?
సురుచిర పీడితేందుకర సుందర కందల సారసేకమో?
ఖరతర తప్త జీవిత నగంబునకుం బరితృప్తి గల్గ భా
స్వర పరజీవ నౌషధి రసంబు మదాత్మ నిషిక్త మయ్యెనో? 11

గీ. సత్య మా పూర్వపరిచిత స్పర్శ మిదియొ,
చిత్త పరిమోహనంబు, సంజీవనంబు,
ప్రబల సంతాప జనిత మూర్ఛ నిపు డడఁచి,
మరల నానంద వివశత్వ ముదువడించె. 12.

సీత—(భయ దైన్యములతో నించుక వెనుక తగ్గి) ఇప్పుడు నా కింత మాత్రమే మహత్తరము.

---

నిమీలిత=మూసికొనిన, పీడిత=పిండఁబడిన, కందల=మొలక, సేకము=చల్లుట, ఖరతర=మిక్కిలి తీవ్రముగా, నగంబు=చెట్టు, నిషిక్తమయ్యెనో—చల్లఁబడెనో.

రామ—(కూర్చుండి) వత్సల యగు జానకీదేవిచే ననుగ్రహింపఁబడుదునుగదా ?
సీత—కటకటా ! ఆర్యపుత్రుఁడు న న్నేల వెదకుచుండెను ?
రామ—ఔఁగాక ! పరికింతును.
సీత—భగవతీ ! తమసా ! మరలిపోవుదము. నన్నుఁ జూచెనేని యననుమత సాన్నిధ్యంబున మహారాజు నాయందు మిగుల నాగ్రహింపఁ గలఁడు.
తమ—ఓవత్సా ! భాగీరథీప్రభావంబున వనదేవతలకు సైత మదృశ్యురాల వైతివి.
సీత—ఔను, కలదది—
రామ—ప్రేయసీ ! జానకీ !
సీత—(దైన్య గద్గదస్వరములతో) ఆర్యపుత్రా ! యీ వృత్తాంతమున కీ వచన మస మంజసము గదా ! (కన్నీళ్లతో) మందభాగ్యురాల నగు న న్నిట్లు వాత్సల్యంబు తోఁ బిలుచు జన్మాంతర సంభావిత దుర్లభ దర్శనుం డగు నార్యపుత్రునియందు దయలేక వజ్రమయురాల నెట్లగుదును ? నా హృదయ మితం డెఱుఁగు నితని హృదయ మేను నెఱుంగుదును.

రామ—(కలయఁ జూచి నిర్వేదముతో) హా ! యెట్లు ? ఇచ్చట నెవ్వరును లేరు.
సీత—భగవతీ ! తమసా ! అట్లు నిర్హేతుకంబుగాఁ బరిత్యజించినను వీని యిట్టి సందర్శనంబున నాహృదయ మేమనుబంధ మెట్టిదో నే నెఱుంగఁ జాలకుంటిని.
తమ—ఎఱుంగుదును వత్సా ! నే నెఱుంగుదును.

శా. ఆసల్ బాసి తటస్థమై, యపకృతి ప్రాప్తిన్ రుషా బద్ధమై,
గాసిన్ దీర్ఘ వియోగ మొందియు, హహా తాత్కాలైక్య సంతుష్టమై,
ధీసౌమ్యత్వమునం బ్రసన్న మయి, భర్తృక్లాంతి విక్లాంతమై, 13.
వాసిం బ్రేమ గరంగిన ట్లొసఁగె నీ స్వాంతంబు దా నింతలోన్.

రామ—దేవి !

గీ. స్నేహ రస శీతలం బగు నిదు స్పర్శ
తనువు దాల్చిన సుప్రసాదంబు వోలె
మించి న న్నిప్పటికిని జొక్కించుచుండె
ముదితరో యెందు నీవు కన్మొరఁగినావు ? 14.

---

రుషా=రోషము. భర్తృక్లాంతివిక్లాంతమై — భర్త యొక్క విచారమువలన ఖేదము నొందుచున్నదై.

సీత—సాకల్యసందర్శిత ప్రేమానుబంధంబులై యానందంబుం జింతు నీ యార్యపుత్ర సల్లాపములు వినుచుంటిని. ఇందలి విశ్వాసంబున నిర్హేతుక పరిత్యాగ పీడితంబై నను నా జననంబు బహూకృతం బైనది.

రామ—ఎక్కడి ప్రేయసి? ఇది నిక్కముగ రామభద్రునకు వృత్తిపరంపరా సంపాదితం బగు కేవల భ్రాంతి.

(తెఱలో) "ప్రమాదము. ప్రమాదము."

క. అవనిజ సల్లకీ కిసలయంబుల—(పూర్వార్ధము వినఁబడును.)

రామ—(కరుణౌత్సుక్యములతో) ఆ శాబమున కేమి?

(మరలఁదెఱలో) "కవగొని కాంతతోడ—(ఉత్తరార్ధము వినఁబడును)

సీత—దాని నెవ్వ రెదుర్కొందురు?

రామ—ఏడ నా దుష్టమృగము? వధూ సహచారి యగు ప్రియాపుత్త్రకుని బరాభవించు న దెయ్యది? (లేచును)

వాసం—(తొందరతోఁ బ్రవేశించి) ఏమీ? రఘుస్వామియా?

సీత—ఏమీ? నా ప్రియ సఖి వాసంతియా?

వాసం—దేవా! జయము.

రామ—(నిరూపించి) ఏమీ? దేవీ ప్రియసఖి వాసంతియా?

వాసం—దేవా! త్వరపడుము త్వరపడుము. ఇటు జటాయు శిఖరంబునకు దక్షిణంబగు సీతాతీర్థంబున గోదావరి నవతరించి దేవీపుత్త్రకుని బరిరక్షింపుము.

సీత—హా! తండ్రీ! జటాయూ! ఇప్పుడు నీవు లేమి జనస్థాన మెల్ల శూన్యమయినది.

రామ—అహహా! ఈ కథా ప్రసంగములు హృదయ మర్మముల భేదించుచున్నవి గదా!

వాసం—దేవా! యిట్టిటు.

సీత—భగవతీ! నిక్కముగ వనదేవతలు సైతము నన్ను గాంచుట లేదు.

తమ—ఓవత్సా! జాహ్నవీదేవి ప్రభావము సర్వ దేవతల కన్న నుత్కృష్ట మైనది. నీ కీ సందియం బేల?

---

వృత్తిపరంపర=సంకల్పపరంపర, వధూసహచారి=ఆఁడు ఏనుఁగుతోఁ గూడియుండు, ప్రియాపుత్త్రకుని = సీతకు సంతానతుల్యముగు నేనుఁగును.

సీత—అట్లయిన ననుసరింతము. (పరిక్రమింతురు.)

రామ—(పరిక్రమించి) భగవతీ! గోదావరీ! నీకు నమస్కారము.

వాసం—(చూచి) దేవా! విజయశాలియు వధూసహాయుడు నగు దేవీపుత్త్రకుని గాంచి యానందింపుము.

రామ—ఆయుష్మంతుఁడు జయించుఁ గాక!

సీత—సీహో! యిది యింతటి దైనది.

రామ—దేవీ! వర్ధిల్లుచుంటివి. సంతోషము!

చ. లలిత మృణాళ పల్లవ విలాస రదాంకురుఁ డౌచు నీదు పీ
నుల లవలీ ప్రవాళము వినోదమునం గొను నీ సుతుండు తా
చెలువున మత్తవారణ విజేతయు యౌవన రాజ్య భోజ్య మం
గళ విధికిన్ శుభాంగి! ప్రసంగంబున భాజనమయ్యె నేటికిన్. 17.

సీత—ప్రసన్న దర్శన యగు నిక్కాంతతో నిప్పుడీ దీర్ఘాయువు వెడ బాయకుండుఁ గాత!

రామ—సఖీ! వాసంతీ! చూడుము. చూడుము. ఈ వత్సచేఁ గాంతానుసరణ నైపుణ్య మభ్యసింపఁ బడినట్లున్నది.

చ. లలిత మృణాళ నాళ కబళంబులఁ గైకొన విచ్చు పుష్కరం
బుల గల గంగతోయములఁ బుక్కిలిలం గొని మేనఁ దుంపురుల్
జిలుకుచుఁ జల్లులాడి, కడుఁ జెల్మి దలిర్ప ననక్రదండ ని
ర్మల మగు నబ్జినీదళము ఛత్రము బట్టె విరామ వేళలన్. 18.

సీత—భగవతీ! తమసా! యిది యింతటి దైనది. ఇంతలో నా కుశలవు లెట్లుండిరో యెఱుంగను?

తమ—ఇది యెంతటిదో వారు నంతటివారే.

సీత—నేను మిగుల మందభాగ్యురాలను. ఆర్యపుత్త్ర విరహమే కాక పుత్త్ర విరహము గూడ నాకు సంభవమైనది.

తమ—భవితవ్య మిట్టిది.

---

రదాంకురుఁడౌచు = మొలకదంతములు కలవాఁడై, లవలీప్రవాళము=లవలీలత మొక్క పల్లవము, పుష్కరంబులు = తెల్లతామరపూవనియు, గజతుండాగ్రమనియు, రెండర్థములుం గూడనగును. తోయములు = ఉదకములు, అనక్రదండ = చిన్ననికాడగల, అబ్జినీదళము=తామరాకు, విరామవేళలన్ = విశ్రాంతియందు.

సీత—నాకుసంతానము కలిగినప్రయోజనమేమి? ఈషద్విరళ కోమలంబు లగు దశనంబుల వెలుంగు కపోలంబులను, నిరంతర మధుర కలహాసంబులను, నిబద్ధ కాకపక్షంబులను, రాజిల్లు నా కుమారకుల నిర్మల ముఖాబ్జముల నార్యపుత్త్రుఁడెందు ముద్దుఁ గొనఁడొక్కొ.

తమ—కానుఁగాక ! దేవతానుగ్రహంబున.

సీత—భగవతీ ! తమసా ! యీ పుత్త్ర స్మరణంబునఁ బ్రస్నుతస్తని నై తత్పితృసాన్నిధ్యమున క్షణమాత్ర గేహిని నై యుంటిని.

తమ—ఇందేమి పల్కనగును? సంతానము స్నేహంబున కుత్కర్ష సీమయు, జననీజనకులకు విశేషముగ నితరేతర సంధాయకంబునుంగదా !

సీ. ననుచు ననురాగ సమ్మేళనంబు వలన
దంపతుల యంతరంగ తత్త్వంబులందుఁ
గల్గు నొండొక సమ్మద గ్రంథి గాఁగఁ
దవిలి నిర్మింపఁ బడిరెపో సంతతి యనంగ. 17.

వాసం—దేవా ! యిటుఁ గూడఁ జూడుము.

గీ. అభినవోజ్జ్వల లోల బర్హంబుతో, ను
దాత్త మదతాండవోత్సవాంతంబునందు
మణికిరీటంబువలెఁ గదంబమునఁ దరుణిఁ
గూడి యల నెమ్మి యుచ్ఛిఖతోఁ దగూనె. 18.

సీత—(ఆనంద బాష్పములతో) అదియా యిది !

రామ—ఆనందింపుము వత్సా ! ఆనందింపుము.

సీత—ఔఁగాక !

రామ—

గ. భ్రమణములం బుటాంతర వివర్తిత సృష్టికిఁ దూఁగి యాడు కన్
గోమల మనోజ్ఞ నృత్యముల భూషణమున్ ఘటియించు కాంతిచేఁ

---

దశనంబులు=దంతములు, కపోలములు=చెక్కిళ్లు, కాకపక్షములు=జునపాలు, ననుచు=వృద్ధి బొందించు, సమ్మదగ్రంథి=ఆనందమను ముడి, ఉచ్ఛిఖ=చలించుచున్న జుట్టు, భ్రమణములన్=మండలాకార నాట్యములయందు, పుటాంతర=ఱెప్పలలోపల, వివర్తిత=త్రిప్పఁబడుచున్న.

దమి మ్మదు హస్త తాళములఁ దాండవితం బగు నిన్ను నత్సల
త్వమునఁ గుమారునిం బలె నెదం దలపోయుచు నుండె నెంతయున్. 19.

ఆహా ! తిర్యగ్జంతువులు సైతము బరిచయము ననుసరించుచున్నవి.

గీ. పరిమిత సుగంధకుసుమాగ్రమునఁ బరిఢవిల్లి
యే కదంబంబు పెరిగెనో వృద్ధిఁ గాంచెనో?

సీత—(కన్నీటితో) ఆర్యపుత్త్రుఁడు తెల్పఁగాఁ గుర్తించె.
రాము— దాని స్వజనంబుఁ బోలె మోదమునఁ గనుచు
జానకిఁ దలంచుచున్న దీ శైలబర్హి. 20.

వాసం—దేవా ! యిటఁ జూడుండుము.

గీ. కిసలితా వనాంతరమునఁ గాంచలో చె
లంగు పెనుగు శయ్యా శిలాతల మిదె !
భూమి సుత యిందు వసియించి పూరి నిడుటఁ
బాసి పో వగవ్వ హరిణ శాబములగములు. 21.

రామ—దీనిని మాత్రము గనుంగొనఁ జాలను. (ఏడుచుచు మఱియొకచోటఁ జూర్చుండును.)

సీత—సఖీ ! వాసంతీ ! ఆర్యపుత్త్రునకు నాకు నీ ప్రదేశముం జూపి యేమి గావించితివి ! కటకటా ! అతఁడే యార్యపుత్త్రుఁడు; అల్లదే పంచవటీవనము; అదే ప్రియసఖి వాసంతి; అవియే వివిధ విస్రంభ సాక్షులగు గోదావరీ వన ప్రాంతములు; అల్లవే పుత్త్ర ప్రాయమ్ము లగు మృగ పక్షి పాదపమ్ములు; దురదృష్టవతి నగు నాకు మాత్ర మీ సమస్తము దృశ్య మగుచున్నను లేనివే. కావున జీవలోక ప్రకృతివ్యత్యయ మిట్టిదే గదా !

వాసం—సఖీ ! జానకీ ! రాముని దుర్దశం గనుంగొన వేమి ?

గ. కువలయ పత్త్ర రాజి మెఱుఁగుల్ గల గాత్రముల్ విలోచనో
త్సవము సతంబొసంగియు లస న్నవ మాధురి గొల్పుచుండు నీ

తాండవితంబగు—నృత్యము చేయింపఁబడినదానవగు, ఉద్గమము=బయలు వెడలిన, దయితే=ప్రియురాలు (సీత), శైలబర్హి =కొండనెమలి, శయ్యాశిలాతలము=పడకరాయి, పూరి=గడ్డి, శాబములు=పిల్లలు. పాదపములు=వృక్షములు, ప్రకృతివ్యత్యయము=సృష్టివైపరీత్యము.

భవుఁడు నెతం గ్రహించి, యవదాత రుచిం గని, విక్లబాంగుఁడై,
యవియుట నెట్టకేనిఁ దెలియంబడియున్ నయనాభిరాముఁడౌ. 22.

సీత—చూచుచుంటిని సఖీ ! చూచుచుంటిని.

తమ—దయితుని సదా కాంచుచుందువుగాక !

సీత—హా ! దైవమా ! ఇతఁడు నన్నును నే నితనిని విడుతు మని యెవ్వరెఱుంగుదురు? కానజన్మాంతరంబునుండియుం బోలె సందర్శించుచున్న నేనువత్సలుండగు నార్యపుత్త్రుని బాష్పాంతరకాలముల ముహూర్త మాత్ర మైనం బరికింతును. (అత్యాదరముతోఁ జూచుచుండును)

తమ—(స్నేహబాష్పములతోఁ గౌఁగిలించి)

గీ. మోద ఖేదంబులను వెల్లి బూను బాష్ప
ధారఁ గొల్పుచు ప్రేమ నుత్తాన దీర్ఘ
మైన నీచూడ్కి ప్రాణేశు నర్ధిఁ దడిపె
బహుళ సిత ముగ్ధ దుగ్ధ స్రవంతి వోలె. 23.

వాసం—

చ. ఫల కుసుమార్ఘ్యమున్ విటపి వర్గ మొసంగెడుగాత ! విస్ఫుర
జ్జలజ మరంద గంధములఁ జల్లి మరుత్తతి వీచుఁగాత ! బ
తులు సతతోత్సుకత్వ మొనగూడఁ గలస్వను లిచ్చుఁగాత ! బెం
పలరఁగ రాముఁడివ్వనిఁ దనంతనె చేరఁగ వచ్చెఁ గ్రమ్మఱన్. 24.

రామ—సఖీ ! వాసంతీ ! యిటఁ గూర్చుండుము.

వాసం—(కూర్చుండి కన్నీళ్లతో) మహారాజా ! లక్ష్మణ కుమారునకుఁ గుశలమా ?

రామ—(వినమి నభినయించి)

గీ. పాణితల దత్త నీర నీవార కుశలఁ
దరుణి పెంచిన తరు పక్షి హరిణకములఁ
గాంచఁ బ్రస్తరోద్భేదయోగ్యరసమువలె
హృదయము గరంచు వికృతి యొందొదవె నాకు. 25.

అవదాతరుచి=తెలుపుకాంతి, విక్లబాంగుఁడై=చిక్కినయవయవములు కలవాఁడై, ఉత్తానదీర్ఘము=దీర్ఘముగాఁ బ్రసరింపఁజేయఁబడిన, దుగ్ధస్రవంతి=పాలకాలువ, విటపివర్గము=వృక్షసమూహము, మరుత్తతి=గాలియొక్క సముదాయము, ప్రస్తరోద్భేదయోగ్యరసము=ఱాళ్లు బగులఁగొట్టుట కర్హమగు రసమనియు, ఱాళ్లయొక్క యుత్పత్తి కర్హమగురసమనియుఁ జెప్పఁగొనవొప్పును, వికృతి=వికారము.

సీత—సఖీ ! వాసంతీ ! ఏవే దారుణురాలవు. కఠినురాలవు. ఇట్లు ప్రజ్వలించు నార్యపుత్త్రునే ప్రజ్వలింపఁ జేయుచుంటివి.

తమ—ప్రణయ శోకము లిట్లు పలుకుచున్నవి.

రామ—సఖీ ! యిందేమి యూహింప నగును ?

గీ. ప్రస్ఫురిత గర్భభార విహ్వలయును, బిభ్య
దేకహాయన మృగ చలాలోక యైన
దాన, మృదు బాల, బిసకల్ప, చంద్రికాభ
యగు తనూవల్లి సత్త్వంబు లణఁప నోపు. 28.

సీత—ఆర్యపుత్త్రా ! ఇదిగో ! జీవించి యుంటిని.

రామ—హా ! ప్రియసఖీ ! జానకీ ! యెచ్చట నుంటివి ?

సీత—కటకటా ! ఆర్యపుత్త్రుఁడు సయిరింపలు గత్తి యేడ్చుచుండెను.

తమ—వత్సా ! యిప్పటి కిదియే యుక్తము. దుఃఖితాత్ములకు దుఃఖ నిర్వాపణ మొనర్ప వలయుఁగదా !

గీ. పఱఁద పెల్లెక్కి తటముల నొరయు వేళఁ
జెఱువునకు గండి వెట్టుటే చెఱుపు తెఱఁగు:
హృదయమున శోక సంక్షోభ మొదవు వేళఁ
దారరవమున నేడ్చుటే తగిన పెంపు. 29.

పటియును రామభద్రుని సంతాప మెల్ల విఘ్నములు గష్టతర మైనది.

వ. నయసరణిన్ సమాహిత మనంబున నిగ్రహమేలఁగా వలెం,
బ్రియసతిఁ బాసి జీవితము గ్రీష్మమునన్ విరివోలె వాడె, ని
ర్దయతఁ దనంత వీడి యలఁతన్ విలపించుట చేసి యిమ్మగా,
దయిన శమించెఁ జిత్త మిపు డైనను రోదన మల్పలాభమే ? 30.

---

ప్రస్ఫురిత=కదలుచున్న, విహ్వల=భయముచే నవయవ స్వాధీనము లేనిది. బిభ్యత్=భయపడుచున్న, ఏకహాయన=ఒక సంవత్సరము వయస్సుగల, మృగ=లేడి వలె, చల=చలించుచున్న, ఆలోక=చూపులుగలది. బిసకల్ప=తామరతూఁడువంటి దియు, సత్త్వంబులు=జంతువులు, పిశాచములు. తారరవమున=ఎలుగెత్తి, సమాహిత=లెస్సఁగా నొప్పిన.

రామ—హా ! కష్టము కష్టము !

మ. ఘన సంవేగమునన్ మనం బగిలు, వ్రక్కల్ రెండుగాఁ గాదు ; మ్రొం
గిని పెద్దం జెడి మేను మూర్ఛఁ గను, జైతన్యంబు వీడ్వోదు ; పె
ల్లున నంతర్జ్వలనంబు దేహము రగులున్, భస్మముం జేయ ; దె
బ్బున మర్మంబులఁ జెండి దైవము గలంచుం, ద్రుంప దీ జీవమున్. 31.

సీత—ఇట్లే యిది—

రామ—తేజస్వులారా ! పౌర జానపదులారా !—

చ. సతి భవనంబున న్నిలువ నైపక పోతిరిగాదె మీర, ల
క్షితనఁ దృణంబుఁ బోలె నడుకానఁ బొరంగితిఁ , గుండనైన మా
నితిఁ ; జిరమైత్రి వాటిలు వనివిషయంబులు నన్ గరంచె ; నే
గతియును లేక యేడ్చెదను ; గాన ననున్ క్షమియింపుఁ డిత్తఱిన్. 32

తమ—శోకవారాశి నాక్రమింప నతి దుష్కరము.

వాసం—దేవా! కడచినదానికై ధైర్య మవలంబింపుము.

రామ—సఖీ! ధైర్య మవలంబింపు మందు వేల?

గీ. భూమిజా శూన్య మయిన యీ భువనమునకు
వర్తమానంబు ద్వాదశ వత్సరంబు,
సీతయను పేరుఁ గూడ నశించెఁ గాని
రాము జీవితమున కింక నేమి యగు. 33.

సీత—ఈ యార్యపుత్త్రి వచనంబులచే మూర్ఛితురాల నైతిని.

తమ—వత్సా! అవును.

గీ. పూరిత స్నేహములు శోకదారుణములు
నగుటనివి ప్రీతి నింపు వాక్యములు గావు,
గరళ మిశ్రితంబు లగుచు నిక్కము మరంద
భార లియ్యవి నెమ్మదిఁ బాఱుచుండె. 34.

రామ—వాసంతీ! నేను—

*అంతర్జ్వలనంబు=లోపలి యుడుకు.

గీ. లోన నాటి తిరశ్చీనమౌ నలాత
శల్యమట్లు, విషోగ్రదంశంబు వోలె,
వాడి యగు శోకకీలంబు స్వాంతమర్మ
తతిని ఖండించు చున్న నోరి ప్రతిని గాదె! 35

సీత—మందభాగ్య నగు నే నిట్లు లార్యపుత్త్రునకు మరల నాయాస కారిణి నైతిని.

రామ—ఇట్లు లతి నిశ్చల స్తంభి తాంతరంగుండ నైనను నా కిప్పుడీ యావేగ మా యా పరిచిత ప్రియ వస్తు సందర్శనంబున—

మ. అమిత క్షోద విజృంభి తేంద్రియ గణవ్యామోహమున్ మాన్ప, నేఁ
దమి నే యే యతనం బొనర్చినను దత్తద్యత్నముం బల్ రయం
బు మెయిం బాఱు ఝరంబు సైకత తటంబుం బోలె లో నైన్నభి
న్నము గావించి వికార మెద్దియొ యెడందం బర్వె నొక్కుమ్మడిన్. 36.

సీత—దుర్నివార భీషణారంభ మగు నీ యార్యపుత్త్రుని దుఃఖ సంరంభంబున నా హృదయంబు నిజశోకోద్భేదంబునం బోలెఁ గంపించు చున్నది.

వాసం—(తనలో) కష్టము! విభుఁ డాపన్నుఁడై యుండెఁ గాన వినోదింపఁ జేసెదను. (ప్రకాశము) దేవా! చిరపరిచితంబు లగు నీ జనస్థాన భూభాగంబుల నవలోకింపుము.

రామ—ఔఁగాక! (పరిపరీక్షించును.)

సీత—దుఃఖోద్దీపకంబులనె ప్రియసఖి విన్దోపాయ మని తలంచు చున్న

వాసం—(కరుణతో) దేవా! దేవా!

మ. తన జాడం గనుగొంచు నను తమి నేతె తుక్కంజమం దుండి, యా
య్యాన గోదావరి సైకతస్థలిని హంసాలోక జాతానాలం
బున జాగ్గె యరుగించుచుం బిహతహం బొల్పారు నిన్దాంచి, చ
వ్వని గిలింపదె భీలిఁ బద్మముకుళి పాణించ ప్రస్తామాంజలిన్. 37

---

తిరశ్చీనమౌ = అడ్డముగాఁదిరిగిన, అలాత = కొఱవివంటి, శల్యమట్లు = బాణాగ్రమువలె, దంశంబు = కోర, శోకకీలము = దుఃఖాగ్ని, అమిత = మిక్కుటమగు, క్షోద = దుఃఖముచేత, విజృంభిత = వృద్ధిపఱుపఁబడిన, ఇంద్రియగణ = ఇంద్రియసమూహముయొక్క, వ్యామోహమున్ = మూర్ఛను, ఝరంబు = ప్రవాహము, సైకత తటంబు = ఇసుకగట్టు, ఉద్భేదము = పగులఁగొట్టుట. పంజము = పొద, పాణించెన్ = ప్రకాశించు చున్న.

సీత—దారుణురాల వైతివి. వాసంతీ! దారుణురాల వైతివి. హృదయ మర్మంబులం గల గూఢ శల్యంబులం బెకలించు నీ కథోద్ఘాతములచే మందభాగ్యురాల నగు నన్ను నార్యపుత్త్రునిం గూడ మరల మరలఁ బరితపింపఁ జేయుచుంటివి.

రామ—దేవీ! జానకీ! యిటు నటుఁ గనఁబడు నట్లుండియు ననుగ్రహింప కుంటివి.

శా. హా! దేవీ! హృదయంబు వ్రెల్లగిలెఁ, గూగాడెం దనూబంధనముల్,
ఏడంచుం బలఁతున్ జగంబు, దరికొల్పెన్ లోని కీలల్ ననున్,
ఖేదోద్విగ్నత నంతరాత్మయుఁ దమోంధీభూతవశా నట్లు పై
పైఁ ఘోరంబుగఁ బర్వె మోహ మిఁక నిర్భాగ్యుండ నే ట్లోగెదన్. 38.

(మూర్ఛిల్లును.)

సీత—కటకటా! ఆర్యపుత్త్రుఁడు మరల మూర్ఛిల్లె. హా! ఆర్యపుత్త్రా! మందభాగ్యనగు నన్నుఁ గూర్చి సకల జీవలోక మంగళాధారుండ వగు నీకు మాటిమాటికి జీవిత సంశయంబుఁ గొలుపు దారుణం బగు దశాపరిణామము తటస్థించుచున్నది. హా! హతురాల నైతిని—(మూర్ఛిల్లును)

తమ—వత్సా! ఊరడిల్లు మూరడిల్లుము. మరల నీహస్త స్పర్శమే రామభద్రునకు జీవనోపాయము.

వాసం—ఏమి? ఇప్పటికిని తేఱుకొనఁడు. హా! ప్రియసఖి! సీతా! నీప్రాణనాథుని మన్నింపుము.

సీత—(తొందరతోఁ జేరి హృదయమునను లలాటమునను స్పృశించుచున్నది.)

వాసం—సంతోషము! రామభద్రుఁడు తెల్విఁ జెందెను.

రామ—

చ. అమరఁగ దేహధాతు బహిరంతర సీమల నక్కజంబుగా
నమృతమయ ప్రలేపముల యట్టు లలందుచు నొక్కస్పర్శ జీ
వమునకు నొక్కపెట్టఁ బ్రతిష్ఠ గలిగించుచు వెండియుం బ్రమో
దము విరియించి గ్రొంగ్రొక విధంబగు మోహము బర్వఁ జేసెడిన్. 39.

(ఆనందమునఁ గన్నులు మూసియే) సఖీ! వాసంతీ! మోదమున వర్ధిల్లుచుంటివి.

వాసం—ఎట్లు?—

---

కథోద్ఘాతములచే=కథలనుజ్ఞప్తికిఁ దెచ్చుటచే, ఉద్విగ్నతన్=అతిశయముచే, ప్రలేపములు=పూతలు.

రామ—సఖీ! మరేమి? జానకి మరల వచ్చినది.

వాసం—ఓదేవా! రామభద్రా! అది యెచ్చట?

రామ—(స్పర్శసుఖము నభినయించి) ఇదిగో! యెదుటనే!

వాసం—ఓయీ! మర్మములఁ జెందు నీ దారుణ ప్రలాపములచేఁ బ్రియసఖీ దుఃఖదగ్ధ నగు మందభాగ్యురాల నన్ను మరల దహించు చుంటివేమి?

సీత—తొలఁగి పోఁగోరుచుంటిని. కాని చిర సౌహార్ద ప్రసన్న శీతలంబై, దీర్ఘదారుణం బగు సంతాపంబు సైతము దోడ్తోడఁ దొలంగించు నార్యపుత్త్రి సంస్పర్శంబున వజ్రలేప లిప్త మైనట్లు చెమర్చుచు నిస్సహ విపర్యస్తమై నా హస్తము పరవశంబైనట్లు కంపించుచున్నది.

రామ—(హస్తము గ్రహించి) సఖీ! ప్రలాపము లెట్లు?

ఉ. ఎయ్యది పెండ్లివేళ గ్రహియింపఁబడెన్ శుభకంకణంబుతో?
నెయ్యది దీర్ఘమైత్రి వహియించె నొ స్వైర సుధార్ద్రసంగతిన్?

సీత—ఆర్యపుత్త్రా! నీవిప్పుడా పురుషుఁడవే యైతివి.

రామ-ఒయ్యన నత్తుషార కరకోపమ సుందరమైన తత్కరం
బియ్యెడ నాకుఁ బట్టువడియెన్ లవలీ మృదు కందళాకృతిన్. 40.

సీత—అయ్యయో! ఆర్యపుత్త్రి స్పర్శ మోహితురాల నగు నాకుఁ బ్రమాద మయ్యెను.

రామ—సఖీ! వాసంతీ! ఆనంద మందీకృతేంద్రియుండనై సాధ్వసంబునఁ బరవశుఁడనై యుంటిని. దీని నీవుఁగూడఁ బట్టుకొనుము.

వాసం—కష్టము! ఉన్మాదమే.

సీత—(తొందరతో విడిపించుకొని తొలఁగి పోవును.)

రామ—హా! హా! ప్రమాదము,

గీ. జడము స్వేదాంచితంబుఁ జంచలము నైన
దాని కరపల్లవంబు సత్వగత మీ॥

---

సౌహార్దము=స్నేహము, వజ్రలేప=పరేనుఅను పూఁతవస్తువుచే, లిప్త=పూయఁబడిన, విపర్యస్తము=వ్యత్యాసము, స్వైర=స్వేచ్ఛగలట్టియు, సుధా=అమృతమువలె, ఆర్ద్రి=చల్లనైనట్టియు, సంగతిన్=స్పర్శచేత,తుషారము=మంచు, కరకము=వడగల్లు, లవలీ= లవలీలతయొక్క, మృదువైన, కందళము=మొలక, సాధ్వసము=భయము, జడము=చల్లనిది.

జడము స్వేదాంచితంబుఁ జంచలము నైన
మత్కరంబున నుండి సంభ్రష్ట మగుచు. 41.

సీత—అయ్యయ్యో ! స్వభావమును బొందక నిశ్చలములై విస్మయగ్రహణమునం దసమర్థములై తత్ప్రయత్నంబున బలాత్కారముగ భ్రమించు నేత్రములతో నార్యపుత్త్రుం డిప్పటికిని యెన్నఁ డాఁ దెలిసికొన లేఁ డయ్యెను.
తమ—(స్నేహ కౌతుకములతోఁ జూచి)

గీ. వల్లభస్పర్శ సౌఖ్యంబు వలన సీత
స్వేద రోమాంచ కంపాన్విత యగుచు
గాలిఁ గదలి, నవీనోదకములఁ దడిసి
కలికల నెసంగు నీపశాఖ యనఁ దనరె. 42.

సీత—(తనలో) ఓహో ! పగవతురాల నైన భగవతియగు తమసచే లజ్జింపఁ జేయఁబడితిని. "ఇట్టిది పరిత్యాగము, ఇట్టిది హృదయాసంగ" మని యీమె యేమను కొనునో గదా !

రామ—(కలయఁ జూచి) హా ! యేమి లేదే కదా? ఓనిర్దయా ! వైదేహీ !
సీత-నిక్కముగ నిర్దయురాలను. ఇట్టి నిన్ను జూచుచుఁ బ్రాణములఁ దాల్చియుంటిని.
రామ—ఎచ్చటనుంటివి ? అనుగ్రహింపుము. ఇట్టి వన్నొడఁబాయ నర్హంబుగాదు.
సీత—ఆర్యపుత్త్ర ! యిదివిపరీతము.
వాసం—దేవా ! ప్రసన్నుఁడవు గమ్ము. ప్రసన్నుఁడవు గమ్ము. అతిశయిత విరహం బగు నాత్మను నీ లోకోత్తర ధైర్యమున నరికట్టుము. నాప్రియసఖి యిచ్చట నెట్లుండును ?
రామ—లేదు. నిశ్చయము. ఉన్నచో దాని వాసంతి గాంచ నెట్లు చూడకుండును ? స్వప్నమా యిది !— నేను నిద్రింపలేదు.— కాక రామునకు స్వప్నమెట్లు ? సర్వవిగ్రహంబుల మహామహిమ గల బహువార కల్పనా నిర్మితం బగు నావిప్రలంభమే నన్ను మాటిమాటికి వెంబడించుచున్నది.

---

సంభ్రష్టమయ్యె = జారిపోయెను, రోమాంచము = గగుర్పాటు, అన్విత = కూడుకొనినది, కలికలు = మొగ్గలు, నీపశాఖ = కడిమికొమ్మ, బహువార = అనేకపర్యాయములు, కల్పనా = సంకల్పించుకొనుటచేత, నిర్మితంబగు = కలిగించుకొనిన, విప్రలంభము = వియోగము.

సీత—ఆర్యపుత్త్రుఁ డిందు దారుణురాల నగు నాచేత నే వంచింపఁ బడియె.

వాసం—దేవా! చూడుము చూడుము.—

మ. అల పౌలస్త్య జటాయు నిర్దళిత కృష్ణాహోరథం బిద్ది, ముం
గల నాభీల పిశాచ వక్త్రియుత కంకాళాత్మలౌ రాసభం
బులివే! హేతి జటాయు పక్షముల నిర్మూలించి నిశాచరుఁ డు
జ్జ్వల సీతం గొని మింటి కేగెఁ జలితాంతర్విద్యుదబ్దాబనన్. 43.

సీత—(భయముతో) ఆర్యపుత్త్రా! తండ్రి హతుఁ డగుచుండె, నేనపహరింపఁ బడుచుంటిని, రక్షింపు రక్షింపు.

రామ—ఆ! పాపిష్ఠ! తాత ప్రాణ సీతాపహారీ! ఎందు బోయెదవు?

వాసం—ఓ దేవా! రాక్షసాన్వయ ప్రళయ ధూమకేతూ! నీకోపమున విషయ మిప్పటికినా?

సీత—ఓహో! ఉన్మత్తురాల నైతిని.

రామ—ఇప్పుడీ ప్రలాపము సార్థకమే యైయున్నది.

ఉ. పతిత వినోదముం గొలుపఁ జాలు నుపాయములం దనర్చి యు
ద్ధత రిపు వీర సంహృతుల గాత్రి మహాద్భుతముల్ ఘటించు నా
సతి తొలి విప్రలంభ మది శత్రువధావధి యయ్యెఁ గాని ప్రి
స్తుత విరహం బనంత పతిఁ జొప్పడె నూరక యెట్టులోర్చెదన్? 44.

సీత—అనంతమైన దనియా హా! హతురాల నైతి మందభాగ్యురాలను. (ఏడ్చును)

---

అల=ఆ, పౌలస్త్య=రావణుని యొక్క, జటాయు=జటాయువుచే, నిర్దళిత=విఱుగఁగొట్టఁబడిన, కృష్ణ=నల్లనగు, అహోరథంబు=ఇనుముచేఁ జేయఁబడిన రథము, ఆభీల=భయంకరమగు, పిశాచముల యొక్క, వక్త్రియుత=ముఖములతోఁ గూడుకొనిన, కంకాళాత్మలౌ—అస్థిపంజరాకృతములయిన, రాసభంబులు=గాడిదలు, హేతి=ఖడ్గముచే, జటాయువు యొక్క, పక్షములన్=ఱెక్కలమూలములను, నిర్మూలించి=తెగనఱికి, నిశాచరుఁడు, చలిత=చలించుచున్న, అంతః=లోన, విద్యుత్=మెఱుపు గలిగిన, అబ్దాబనన్=మేఘమాయనునట్లు, ఉజ్జ్వల=ప్రకాశించుచున్న, సీతంగొని—మింటికి=ఆకాశమునకు, ఏగె. ధూమకేతువు=తోఁకచుక్క, సంహృతుల=చంపుటచే.

రామ—హా! కష్టము!—

చ. అలకపిరాజు చెల్మి, కపులంపతి సీరము, భల్లుకేంద్రు ధీ
బలమును, నెందు నిష్ఫలము? పావని యొందుఁ జొరంగ నేరఁ? డా
నలుఁ డను విశ్వకర్మ హితు నందనుఁ డెందుఁ బథం బొనర్పఁగే?
పలుకుల కెంగు లక్ష్మణాన కానదో? యాగౌట నుంటినో? ప్రియా? 45.

సీత—పూర్వ విరహము నార్య మన్నింపఁ బడితిని.

రామ—సఖీ! వాసంతీ! సఖులకు దుఃఖముకొఱకే రామ సందర్శనము. ఎంతవఱకు నిన్నేడ్పింతును? కావునఁ బ్రయాణంబునకై నాకు సెల వొసగుము.

సీత—(భయ మోహములతోఁ దమసం బట్టుకొని) భగవతీ! తమసా! ఆర్యపుత్త్రుం డరుగుచుండెఁ నేమిగతి?

తమ—వత్సా! ఊరడిల్లు మూరడిల్లుము. ఆయుష్మంతులగు కుశ లవులకు వర్షగ్రంధి మంగళము నాపాదింప భాగీరథీ పదసన్నిధికి మనమునుం బోవుదము.

సీత—భగవతీ! అనుగ్రహింపుము. దుర్లభ జనుని క్షణమాత్ర మవలోకింతును.

రామ—కల దిప్పు డశ్వమేధమునకై నాకు సహధర్మ చారిణి.

సీత—(కంపముతో) ఆర్యపుత్త్రా! అది యెవతె?

రామ—హేమమయం బగు సీతాప్రతిమ.

సీత—(ఊరడిల్లి కన్నీళ్ళతో) ఇప్పుడు న వార్యపుత్త్రుండవైతివి. ఓహో! ఇప్పు డార్యపుత్త్రుండు నా పరిత్యాగ శల్యంబు నున్మూలించె.

రామ—దానియందైనను బాష్పపూర్ణమగు దృష్టికి సంతుష్టిఁ గల్గించెదను.

సీత—ఆర్యపుత్త్రునిచే మన్నింపఁ బడుచు నాతని నానంద పఱచుచు జీవలోకమున కాశానిబంధనం బయ్యెఁ గాన నది ధన్యురాలు.

తమ—(స్మిత స్నేహబాష్పములతోఁ గౌఁగిలించి) ఓవత్సా! ఆత్మ స్తవనముం జేసి కొనుచుంటివి.

విప్రలంభము = వియోగము, శత్రు = విరోధులయొక్క నగ=చంపుటయే అవధి=హద్దు, కపిరాజు=సుగ్రీవుఁడు, కపులు=కోఁతులు, భల్లుకేంద్రుఁడు = జాంబవంతుఁడు, పావని = ఆంజనేయుఁడు, పథము = మార్గము, ఉన్మూలించె=ఊడఁదీసెను.

సీత— (లజ్జతోఁ దలవంచి తనలో) భగవతి పరిహసించుచున్నది.

వాసం— ఈ సమావేశము మాకు మహానుగ్రహము. ప్రియాణ విషయమున నెట్లు కార్యభంగము గల్గెనో. అట్లు కావింపఁ దగును.

సీత— ఇప్పుడు వాసంతి నాకుఁ బ్రతికూల యైనది.

తమ— రమ్ము పోవుదము.

సీత— (కష్టముతో) అట్లే చేయుదము.

తమ— ఎట్లు రాఁ గలవు?

గీ. వల్లభునియందు నెఱి నాటఁ బడిన యట్టి
వేడ్కచే సోఁగబారు నీ వీక్షణంబు
మర్మములఁ ద్రించు యత్న సంపదలనైనఁ
తివియఁ బడఁ జాల దయ్యె నుదీర్ణభంగి. 46

సీత— అపూర్వ సుకృత జనిత దర్శనంబు లగు నార్యపుత్త్రి పాదపద్మములకు నమస్కారము. (మూర్ఛిల్లును)

తమ— వత్సా! ఊరడిల్లు మూరడిల్లుము.

సీత— (ఊరడిల్లి) మేఘాంతరాళమునఁ బూర్ణిమా చంద్రు నెంతకాల మవలోకింపఁ గలము?

తమ— ఓహో! ఘటనా విశేషము.

చ. కరుణరసంబు పన్నుగ నొకం డయి యుండి నిమిత్తభేదత
న్విగత విభిన్నమై వివిధవైఖరులం బలె మార్పులొందు, వి
స్ఫురిత తరంగ సంభ్రమణ బుద్బుద రూప వికార సంతతిం
బొరసియుఁ గన్గొనం జలము పొందుగ సర్వము దానయౌ గతిన్. 47.

రామ— విమానరాజమా! యిట్టిటు. (అందఱు లేచుచున్నారు.)

---

ఉదీర్ణభంగి=విశేషముగా, విస్ఫురిత=చలించుచున్న, తరంగ=అలల యొక్కయు, సంభ్రమణ=సుడుల యొక్కయు, బుద్బుద=బుడగల యొక్కయు, రూప=ఆకృతులచే, వికార=మార్పు యొక్క, సంతతిన్=పరంపరను, పొరసియు=పొందియు.

తమ—వాసం— (సీతారాములం గూర్చి)

గీ. పుడమి మిన్నెల్లఁగూడ మా బోంట్లతోడఁ
గొలుత ఛందఃపరిప్రోక్తయా కులవిభుండు
ననుగతారుంధతీకుఁడౌ ముని వసిష్ఠుఁ
డొసఁగ నిరువుర బహుభవ్య మొసఁగ గాత. 48

(అందఱు నిష్క్రమింతురు.)

—ఛాయ యను తృతీయాంకము,

సంపూర్ణము.



ఛందః=వేదములను, పరిప్రోక్తయా = చెప్పినవాఁడగు, కులవిభుండు=సూర్యవంశస్థాపకుఁడగుసూర్యుఁడు, అనుగతారుంధతీకుఁడు=అనుసరింపఁబడిన అరుంధతిగలవాఁడు, భవ్యమొసఁగ=మంగళ మగునట్లు.



# ఆంధ్రీకృతోత్తరరామచరిత్రము.

## చతుర్థాంకము.

(ఇర్వురు తాపసులు ప్రవేశింతురు)

ఒకఁడు—సౌధాతకీ! యిపుడు విశిష్టాతిథి జనాలంకృతంబగు వాల్మీకిభగవానునా శ్రిమస్థానమందలి విపులకార్యోపక్రమరమణీయకంబుం గనుంగొనుము.

మ. నవసూతప్రియ గోగ్రిల నున్న మమగోష్ణంబైన నీవారభ
క్తవరస్రావము దృప్తి నాశ్రమకురంగం బానుచుండెన్, స్నుతా
ప్లవ రుచ్యాన్న లసత్సుగంధలవ సంపన్మిశ్రమై చాల నిం
పవు కర్కంధుఫలాఢ్య శాక పచనోద్ధామోద మేపారెడిన్. 1.

సౌధాతకి—ఇప్పుడీ నెఱసిన పెద్ద గడ్డముల వారికి మహత్తరమయిన యనధ్యాయకారణము సంభవించినది.

ప్రథముఁడు—(నవ్వి) సౌధాతకీ! గురుసులయందు బహుమాన కారణ మపూర్వముగా నున్నదే?

సౌధా—ఓభాండాయనా! యిప్పుడీ మిక్కుటమగు వృద్ధసంఘమునకు మొనగాఁడై నారలు గట్టి వచ్చినయీయతిథి పేరేమి?

---

నవసూత=క్రొత్తగాఈనిన, నీవార=నివ్వరి, భక్త=అన్నసంబంధమయిన, స్రావము=గంజి, స్నుత=నేతితో, ఆప్లవ=లెస్సగాఁదడుపఁబడిన, రుచ్యాన్నము=రుచిగలయన్నము నుండిబయలువెడలిన, లసత్సుగంధలవ=సువాసనయొక్క లేశము యొక్క, సంపన్మిశ్రమై=సంపత్తుతోగూడినదై, కర్కంధుఫల=రేఁగుపండ్లతో, ఆఢ్య=ఎక్కువగాఁజేయఁబడిన, శాక=కూరయొక్క, పచన=వండుటయందు, ఉద్ధ=బయలువెడలిన, ఆమోదము=పరిమళము.

భాండా—ఛీ! పరిహసించెదవా? ఋశ్యశృంగాశ్రమము నుండి యరుంధతిని మును కొనిన దశరథేంద్రుని భార్యలకు నియామకుండై వసిష్ఠమహాముని విచ్చేసెను. ఇట్లు ప్రేలెద వేల?

సౌధా—ఆఁ? వసిష్ఠుఁడా! నేను తోఁడేలో? పెబ్బులియో? యనుకొంటిని.

భాండా—ఆఁ! యేమనుచుంటివి?

సౌధా—అతఁ డరుదెంచినంతనే దక్షిణకని యావఁబెయ్య పాపమ్మని చంపఁబడినది.

భాండా—"సమాంసో మధుపర్క" యను నామ్నాయమును మన్నించుచు గృహస్థులు శ్రోత్రియాతిథి కొఱకు వత్సతరిని గాని మహోక్షమును గాని మహాఛాగమును గాని యిచ్చుచుందు రని ధర్మసూత్రకారులు పలుకుచున్నారు.

సౌధా—ఓహో! ఓడిపోయితిని.

భాండా—ఎట్లు?

సౌధా—వసిష్ఠమిశ్రు లరుదెంచ వత్సతరిని హింసించె. సద్యస్సమాగతుఁ డగు జనక రాజర్షికి వాల్మీకి భగవానులు దధి మధువుల చేతనే మధుపర్కమును నెఱవేర్చె. వత్సతరిని విడిచె.

భాండా—ఋషులు మాంసాహారమును మాననివారి కీ కల్పము నను మతించుచున్నారు. పూజ్యుఁ డగు జనకుఁడో మాంస పరిత్యాగి.

సౌధా—ఏల?

భాండా—అతఁ డిప్పుడే సీతాదేవి కట్టి దైవప్రాతికూల్యమును విని వానప్రస్థుఁ డయ్యె. అట్లు చంద్రద్వీప తపోవనమునఁ దపం బొనర్చుచుండు నితనికిఁ గొన్ని సంవత్సరంబులు గతించె.

సౌధా—పిదప నిచ్చటి కేల వచ్చె?

భాండా—పురాతన హిత మిత్రుఁ డగు వాల్మీకిమునిని సందర్శింప.

సౌధా—ఇప్పు డతనికి బంధు సందర్శనం బయ్యెనా?

భాండా—ఇప్పుడే వసిష్ఠ భగవానులు కౌసల్యాదేవి చెంతకు భగవతి నరుంధతిం బంపి విదేహనాథుని స్వయముగా నరిగి చూడ నియమించె.

---

ఆమ్నాయము = వేదము, వత్సతరి = ఆఁబెయ్య, మహోక్షము = పెద్దయెద్దు, ఛాగము = మేక, సద్యస్సమాగతుఁడు = అప్పుడే వచ్చినవాఁడు, దధి = పెరుగు, మధువు = తేనె

సౌధా—ఈవృద్ధులందఱు న్నొండొరులు గలిసికొనినచో, బ్రహ్మచారులం గూడి మన మును అనధ్యాయ మహోత్సవంబు నాటలతో బహూకరింతము.

భాండా—బ్రహ్మవేత్తయుఁ బురాతన రాజర్షియు నగు జనకుండు వసిష్ఠ వాల్మీకుల సేవించి యిప్పు డాశ్రమ ప్రాంత వృక్ష మూలమున నున్నవాఁడు.

క. ఈతఁడు మది నిత్యోజ్జ్వల
సీతాశోకంబు వలనఁ జేట్పడి యంత
స్స్వ్యతానల మగు జరఠీ
భూత వనస్పతియుఁ బోలెఁ బొగులుచు నుండెన్. 2.

(నిష్క్రమించిరి.)

విష్కంభము.

(పిమ్మట జనకుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

జన—

ఉ. నందనియందుఁ దాదృశ ఘనవ్యతిరేకము గల్గి తీవ్రమై
డెందము వ్రచ్చి వేదన గడిందిగఁ జేసి పురాతనత్వముం
జెందియుఁ గ్రొత్తవోలె నెడ నేయక యేచు దురంత శోకముం
గ్రందుగఁ గూర్చి మర్మముల రంపమునం బలెఁ గోసె దానిచేన్. 3.

కష్టము! ఇట్లు వార్థకంబునను, దుస్సహం బగు దుఃఖంబునను, మఱియుఁ బరాక సాంతపనాది తపంబులను, రసధాతువులుశుష్కింప దుర్బలం బైన నా దగ్ధదేహ మిప్పటికిం గూల దయ్యె.— "ఆత్మఘాతుకుల కంగతమసావృతంబు లగు నసుర్య లోకంబులు విధింపఁబడు" నని మహర్షులు తలంచుచున్నారు. పెక్కేండ్లు గడచి నను బ్రతిక్షణోద్భేదంబుచే స్పష్ట నిర్భాసమై నూత్నమైనదియుం బోలె దారుణం బైన నాదుఃఖోద్వేగ ముపశమింప దయ్యె. ఓ తల్లీ! దేవయజన సంభవా! సీతా! నిని

ఉజ్జ్వల = మండుచున్న, అంత స్స్వ్యతానలము=తొఱ్ఱలో నిప్పగల, జరఠీభూత—ముదిసిన, వనస్పతి=వృక్షము, తాదృశ = అట్టి, ఉద్భేదము = బాధించునది, నిర్భాసమై=ప్రకాశించునదియై.

కౌస—ఇతఁడు మహారాజునకు హృదయానందకరుఁడగు సన్మిత్రుఁడగు నాశకికిఁ సంద్రదీయు నగు రాజర్షి; హా యిట్టి కష్టకాలమున మఱి నాఁగాఁ గాంచితిని. హా! దేవా! ఆ సర్వ మిప్పుడు శూన్యము.

జన—(సమీపించి) భగవతీ! అరుంధతీ! వైదేహుఁడగు సీరధ్వజుఁడు నమస్కరించుచున్నాఁడు.

గ. గురుతుగఁ బ్రాగ్వృత్త గురులకు గురువయ్యెదు, బుద్ధి సన్మహా
త్మురుఁడును, నీవు భర్త నిను బట్టి తెమ్ము శుచియై వెలుంగ
నరితపు లోకవంద్యవై, జగచ్ఛ్రేష్ఠమాత్రివి, నీకు భూతల
స్థిరశిర మొప్ప నో భగవతీ! తొలిమ్రొక్కుజనుఁ బోదా! నమస్కరించెద. 10.

అరుం—పరంజ్యోతి నీకావిర్భవించుఁగాక! జ్యోతిర్మయమగు రజోగుణాతీతుఁ డగు దేవుండు నిన్ను బవిత్రీకరించుఁగాక!

జన—ఆర్యా! గృష్టి! నిమమా యీనా పాలుగాంచినది?

కంచు—(తనలో) అతినైష్ఠుర్యమున నిశ్చయమునకా రక్షించితిని. (ప్రకాశముగా) రాజర్షిచంద్రా! ఈశోకమునకే చిరకాలమును శ్రీరామచంద్ర వదనేందు దర్శనంబు వీడి మిగుల దుఃఖించుచుండి రామభద్రుఁడునే దుఃఖింపఁ జేయఁ జనదు. రామభద్రుఁ డైనను దుస్సహంబగు లోకాపవాదమున జిల్లెడల ఘూర్ణిల్లఁ జేయు నత్యల్పు లగు పౌరజానపదులు పావకశుద్ధిని విశ్వసింపని యిట్టి దారుణం బాచరించె.

జన—ఆఁ! మా యపత్యంబు శోధింపఁ బావకుఁడన నెవ్వఁడు? కష్టము! ఇట్లు పలుకు మానవునిచే మేము రామపరిష్కృతుల మయ్యును మగలఁ బరిష్కరింపఁ బడుచుంటిమి.

అరుం—(నిట్టూర్చి) ఇదియుట్లే; వత్సాగమదల నగ్నియను నక్షరములు వలదు, సీత యనియే చాలును. హా! వత్సా!

చ. ఒనరఁగ శిష్యవో? కనయవో? యగు డయ్యదఁ బెంచు మట్లు; నీ
ఘనతర శుద్ధి ఏగాంచిల గాటపు భక్తి జనించె నీ; నం
గనవును బాల నయ్యును గనఁ ద్రిభువనాస్యముగాని? ప్రాంజనం
బెనయ గుణాఢ్యులగు గుణ దేశ, లింగముఁ గాంచముగ్నగా. 11.

సీరధ్వజుఁడు=నాగలి జెండాగాఁ గలవాఁడు, మహోదరుఁడా = తేజశ్శాలి.

కౌస—(తెలివినొంది) హా! వత్సా! జానకీ! యెచ్చటనుంటివి? వివాహ లక్ష్మీ పరిగ్రహాలంకృతాంగవై సముజ్జ్వల ధవళ మందహాసం బయిన నీ సుందర ముఖారవిందంబుం దలపోయుచుంటిని. విస్ఫుర చంద్ర చంద్రికాభిరామంబు లగు నీ యంగములచే మగల రోపుత్త్రి! నాయంకతలంబు నలంకరింపుము. ఇత్యాది 'రఘుకుల కూటస్థుఁడగు గోడ లయ్యెను జనకానుబంధంబున మనకు మాత్రము పుత్త్రిక యే' యని నిరంతరంబు మహారాజు పల్కుచుండును.

కంచు—దేవి పల్కినట్లే.—

గీ. బిడ్డ లయిదుగు రయిన భూవిభున కగయ
బహుళ ప్రమోదకారి సుబాహువైరి
నలువురైనను గోడండ్రు వెలయ నతని
కాంత యగు సీత హితురాలు శాంతవోలె. 16.

జన—హా! ప్రియసఖ! మహారాజ దశరథ! సర్వవిధంబుల మనోరముఁడ వగు నిన్నెట్లు మరతును?

మ. ధరణిం గన్నియ తండ్రు లల్లుని నిజాపత్యశ్రేణి నర్థింతు రా
సర తాల్ మారె మనందు; నీవె నను వాంఛ లీలఁ బూజించి తా
స్థిరలీలుండవు పోతి కాలమున, మా సన్ బంధుతా బీజ మున్,
నరకాభీల జగంబునం దఘునిధిన్ నాజీవితం జేటికిన్. 17.

కౌస—పుత్త్రి! జానకీ! వృథ వజ్రలేపంబుచే నువ నిబద్ధమైనట్లు సుస్థిరంబగు నా దుష్టజీవితంబు నిర్భాగ్యురాల నగు నన్ను విడిచి పోవుట లేదు.

అరుం—ఊరడిల్లుము రాజపుత్త్రి! ఎడనెడ నశ్రువిశ్రామంబు నాచరింపనగు. మఱి యీ ఋశ్యశృంగాశ్రమంబున మీ కులగురుండు "తగని దుఃఖము సంభవించినను శుభోదర్కంబు గాఁగల" దని పల్కిన వాక్య మేల స్మరింపవు?

కౌస—భగవతీ! అడియాస మించినది.

అరుం—రాజపుత్త్రీ! దాని మృషావాక్య మని యే తలంచెదవా? సంతుష్తియా! అన్యథా తలంపరాదు. నిక్కముగా జరిగి తీరఁ గలదు.

---

చంద్రిక = వెన్నెల. అశ్రువిశ్రామంబు=కన్నీళ్ళనరికట్టుట, శుభోదర్కము = శుభము ముందుకు రాఁగలకాలము, మృష=అబద్ధము.





గీ. విస్పుర ద్బ్రహ్మతత్త్వలో విప్రవర్యు
లాడు సూక్తుల సందియ మంద వలదు;
భద్రియగు లక్ష్మి వీరల వాణి నిల్చు;
వ్యర్థవాక్యంబు వీరలు బల్కరెపుడు. 18.

(తెఱలోఁ గలకలము—అందఱు నాకర్ణింతురు.)

జన—ఈనాఁడు శిష్టానధ్యాయ మని మిక్కుటముగాఁ గ్రీడించు బ్రహ్మచారుల కలకల మిది.

కౌస—బాల్యంబు మాత్రము సులభ సౌఖ్యమైనది. (నిరూపించి) వీరిలో రామభద్రి కౌమార లక్ష్మీ పరిశోభితంబులై మంజులోదార సుందరంబు లగు నంగములచే మన నేత్రములఁ జల్లఁజేయు నీ బాలకుఁ డెవ్వఁడు ?

అరుం—(స్వగతము ఆనంద బాష్పములతో) ఇదే ! భాగీరథీ నివేదిత రహస్య కర్ణామృతము. కాని యాయుష్మంతు లగు కుశ లవులలో వీఁ డెవ్వఁడో యెఱుంగను.

జన—

మ. అసితేందీవర పత్ర కాంతుఁడు, శిఖండాలంకృతుండు, న్విభూ
తి సమగ్రుండు, ధనూరుచిన్ వటుసభన్ దీపింపఁగాఁ జేయుచుం
బసమై వత్స రఘూద్వహుండు మరలం బాలత్వముం దాల్చెనా
వెసఁ గానంబడు వీఁ డెవండొ ? కనులన్ వే వే సుఖం బూనెడిన్. 19.

కంచు—ఈ డింభకుఁడు క్షత్రియ బ్రహ్మచారి యని తలంచెదను.

జన—ఇట్లే యిది. కాననే—

మ. వెనుకం జుంచు దగుల్ గఱుల్ సెలయ నిల్చెం దూణముల్ క్రేవలం,
బ్రశాతోరస్స్థలిఁ దాల్చె భస్మ రురు చర్మంబుల్ బవిత్రంబు, బా

---

నివేదిత = చెప్పఁబడిన, అసితేందీవరపత్రము = నల్లకలువ రేకు, శిఖండము = జుట్టు, చుంచు = జుట్టు, గఱుల్ = బాణము యొక్క ఱెక్క, తూణములు = బాణములు, క్రేవలన్ = ప్రక్కలను, ప్రశాత = స్తోత్రపాత్రమగు, ఉరస్స్థలిన్ = వక్షస్స్థలమందు, భస్మ = విభూతియు, రురుచర్మంబులు = జింకతోలు, పవిత్రంబు = యజ్ఞోపవీతమును, దాల్చెను.

వన మాంజిష్ఠ మయాంతరీయమును మూర్వా మేఖలం గట్టెఁ, గే
లను గోదండముఁ బ్లక్షదండ జపమాలా కంకణంబుల్ గొనెన్. 20.

భగవతీ! అరుంధతీ! వీఁ డెచ్చటివాఁడో యూహింతువా?

అరుం—మే మిప్పుడే గదా వచ్చితిమి!

జన—ఆర్య! గృష్టి! నాను మిగుల వేడుక పొడముచున్నది. కాన వాల్మీకి భగవానునే చేరి యడుగుము. "ఎవ్వరో వృద్ధులు నిన్ను రాఁ గోరుచుండి" రని యీ బాలకున కెఱింగింపుము.

కంచు—యీ రాన తిచ్చినట్లే. (నిష్క్రమించును.)

కాప—ఇట్లాహూతుండై యరుదెంచు నాదునా?

అరుం—ఇట్టి నిర్మాణంబునకు గాంభీర్యంబు భేదించునా?

కాప—ఎట్లు? వినయాకర్షిత గృష్టి వనమునందె మునికుమారుల విడిచి యూ డింభకుం డిట్లెదురు వచ్చుచుండెనే?

జన—(చాలతడవు పరికించి) ఓహో! యేమిది?

చ. వినయ శిశుత్వ గాంభీర్య పరివేష్టిత పేశల మైన నీని యీ
మన మహిమంబు నేర్పరులు గాని గొలుంగరు మూర్ఖులేని, నా
మనము ప్రమూఢ మైన బలమండితుఁ డై హరియించె నీఁడు, హె
చ్చైన నినుమున్ గ్రహించు లఘుచుంబక ఖండము పోల్కి నెంతయున్. 21.

లవుఁడు—(ప్రవేశించి తనలో) పూజ్యులైనను నామ క్రమాన్వయంబులం దెలియక నాయంత నెట్లు నమస్కరింపఁ గలను? (యోజించి) ఇదెమాత్ర మవిరుద్ధ పద్ధతి యని వృద్ధుల వలన వినంబడెడి. (వినయముతోఁ జేరి ప్రకాశముగా) ఇదే! మీకు లవుని శిరఃప్రణామమగు లి.

అరుం—జన—కల్యాణనిధీ! ఆయుష్మంతుఁడవు గమ్ము.

కౌస—వత్సా! దీర్ఘాయువవుగమ్ము.

---

మాంజిష్ఠమయ=పసుపు రంగుతోఁగూడిన, అంతరీయమును=ఉత్తరీయమును, మూర్వా మేఖల=మూర్వయను గడ్డితోఁ జేనఁబడిన మొలనూలు, ప్లక్షదండము=రావిపుల్ల, ఆహూతుఁడై=పిలువఁబడినవాఁడై, పరివేష్టిత=ఆవరింపఁబడుటచేత, పేశల=మృదువయిన. ప్రమూఢమైనన్=ఎక్కువ మూర్ఛలోనున్నను, లఘుచుంబక ఖండము=తేలికయగు సూదంటురాయి.

అరుం—తనయా! రమ్ము. (లవుని దొడపై నిడుకొని స్వగతము) సంతోషము! చిర కాలమునకు నా యుత్సంగమే కాదు మనోరథంబుఁ గూడ సంపూర్ణమైనది.

కౌస—పుత్రా! యిటుగూడ రమ్ము. (కౌఁగిలించుకొని స్వగతము) ఓహో! దరవికస్వరేందీవర మాలికా శ్యామలోజ్జ్వలంబైన దేహబంధంబుననే కాక, కబళిత కమల కింజల్క కాదంబ మధుర గళ రవోదార దీర్ఘస్వరంబునను రామభద్రు ననుకరించి యుండె. వికచారవింద గర్భ మంజులం బైన యీ కుమారుని తనుస్పర్శంబు నట్టిదియే. (ప్రకాశము) వత్సా! ఆయుష్మంతుఁడా! నీ ముఖచంద్రు నాలోకింతును. (చుబుకము నెత్తి కన్నీళ్ళతో సాభిప్రాయముగా నపవారించి) రాజర్షీ! చూడవేమి? నిపుణముగఁ బరికింప నితని ముఖము వత్స యగు జానకి ముఖచంద్రునితో సరిపోలుచున్నదే?

జన—చూచుచుంటి నమ్మా చూచుచుంటిని.

కౌస—ఓహో! నా చిత్త మున్మత్త మైనదియుం బోలె నెద్దియో చింతించుచు మిగులఁ జంచలించుచున్నది.

జన—(స్వగతం)

చ. ధరణిజ రూపమున్ రఘువతంసుని కాంతియు నీకుమారు నన్
విరివిగఁ బూర్ణభంగిఁ బ్రతిబింబిత మైనటులం దరర్చె, వా
జ్నిరతి, నిసర్గ నమ్రతయు, నిర్మల సత్త్వము సైత మల్లదే!
యెరిమురి నాదు చిత్త మడియాసలఁ బాఱుచు నుండె హా! విధీ! 22

కౌస—వత్సా! కలదా నీకుఁ దల్లి? తలఁపోయుదువా తండ్రిని?

లవు—లేదు.—

కౌస—అట్లయిన నీ వెవ్వరివాఁడవు?

లవు—భగవానుఁడగు వాల్మీకి సంబంధుఁడను.

కౌస—ఓవత్సా! వక్తవ్యముఁ జెప్పుము.

లవు—ఇంతవఱకే యెఱుంగుదును.

(తెఱలో) ఓహో! సైనికులారా! "ఆశ్రమప్రాంత భూమి నెవ్వండు నాక్రమింపరా" దని యీ కుమార చంద్రకేతుఁ డాన వెట్టుచున్నాఁడు.

---

దర=కొంచెము, వికస్వర=వికసించిన, ఇందీవర=నల్లకలువవలె, శ్యామల=నలుపుచేత, ఉజ్జ్వలంబై=ప్రకాశించునదియై, కబళిత=తినఁబడిన, పద్మకేసరములు గల, కాదంబ=కలహంసలయొక్క, మధురమైన-చుబుకము=గడ్డము.

అరుం—జన—ఓహో ! యజ్ఞాశ్వరక్షణార్థమై యరుదెంచిన చంద్రకేతు కుమారుఁడిపుడు చూడఁదగినవాఁడు. అహో ! సుదినము.

కౌస—వత్సయగు లక్ష్మణుని పుత్త్రుఁ డాజ్ఞాపించు చున్నాఁ డని సుధాబిందు సుందరంబు లగు నక్షరంబులు వినవచ్చుచున్నవి.

లవు—ఆర్యా ! ఈ చంద్రకేతుఁ డన నెవ్వఁడు ?

జన—దశరథ పుత్త్రులగు రామ లక్ష్మణుల నెఱుఁగుదువా ?

లవు—వారే రామాయణ కథానాయకులు.

జన—అట్లయిన నెట్లెఱుంగవు ? ఆలక్ష్మణుని కుమారుఁడే యీ చంద్రకేతుఁడు.

లవు—ఊర్మిలానందనుఁడా ! అట్లయిన జనకరాజర్షి దౌహిత్రుఁడు.

అరుం—(నవ్వి) కుమారుఁడు కథా ప్రపంచంబు వెల్లడించె.

జన—నీ విట్టి కథా కోవిదుండ వేని నే నొకటి నడుగుచుంటిమి. ఆదశరథాత్మజుల కేపేరిటి సంతతి యేభార్యలందు జన్మించిరి ?

లవు—ఈ కథా విభాగము మేముగాని యెవరులుగాని వినియుండలేదు.

జన—ఏమి ? కవి రచింపలేదా ?

లవు—రచించె. వెల్లడింపలేదు. అందలిదే యేకదేశమును సందర్భాంతరమున సరస రూపకంబుగా నిర్మించి స్వహస్త లిఖిత మగు నాగ్రంథమును వాల్మీకిభగవానుఁడు తౌర్యత్రిక సూత్రకర్త యగు భరతమునికిఁ బంపె.

జన—ఎందులకు ?

లవు—ఆ మహాత్ముఁడు దాని నచ్చరలచే నభినయింపఁ జేయు నని.

జన—ఇది యెల్ల మాకు సాకూతముగాఁ గానఁబడుచున్నది.

లవు—వాల్మీకి భగవానునకు దీనియందు మిగుల నాదరము. కొందఱి శిష్యులచే నీ పొత్తమును భరతాశ్రమంబున కనిపె. వారికి సహాయుఁడై ప్రమాద నివారణార్థముగా ధనుర్ధారి యగు మా సోదరుం డంపఁ బడియె.

కౌస—నీకు సోదరుఁడుఁ గూడఁ గలఁడా ?

లవు—కలఁడు, ఆర్యుఁడగు కుశుఁడు.

కౌస—పెద్దవాఁడనుచుంటివే ?

తౌర్యత్రికము = నృత్తము, వాద్యము, గీతము, సాకూతము = అభిప్రాయగర్భితమయిన.

లవు—ఔను ప్రసవ క్రమంబున నతఁడు జ్యేష్ఠుఁడు.

జన—కవలా దీర్ఘాయువులు ?

లవు—ఔను.

జన—చెప్పుము. ప్రబంధ కథా నిర్మాణమున కవసాన మేది ?

లవు—అనృత పౌరాపవాద విత్రస్తుఁ డగు భూపాలుని చేఁ బరిహరింపఁబడి సన్నిహిత ప్రసవ వేదన యగు యజ్ఞభూనందనియగు సీతాదేవిని లక్ష్మణుఁడు ఒంటిగా నరణ్యమున విడిచి మరలి చనె. ఇది.

కౌస—హా! వత్సా! సుందరేందుముఖీ! ఏకాకిని వగు నీ తనూ కుసుమమున కిప్పు డెక్కడి దైవ దుర్విపాక పరిణామ మాపతిల్లెను ?

జన—హా! వత్సా!—

గీ. అభినవాభీల పరిభవం బంది నాఁటి
ప్రసవ కాలిక వేదన బడలి నీవు
మాతుక మృగంబు లెల్లెడఁ గవియ నడలి
పలుమరును నన్నె శరణని తలఁతు నిజము. 23.

లవు—(అరుంధతితో) ఆర్యురాలా! వీ రెవ్వరు?

అరుం—ఈమె కౌసల్య, ఇతఁడు జనకుఁడు.

లవు—(బహుమాన ఖేద కౌతుకములతోఁ జూచుచున్నాఁడు)

జన—ఓహో! పురజనుల దౌరాత్మ్యము! ఓహో! రామభూపతి సాహస కృత్యము?

ఉ. ఏపున వజ్రఘోర మగు నీవ్యసనంబును సారె జూచు నా
కోపము చాప శాపముల గుస్సున మండెడుఁ గాల నిద్దియే!

కౌస—భగవతీ! రక్షింపు రక్షింపు. కుపితుఁ డగు రాజర్షి నుపశమింపఁ జేయుము.

అరుం— గీ. మహిఁ బరాభవ మందిన మానసముల
హృదయ మెల్లవికంబుల నిట్టు లుండు
భూపతీ! పుత్త్రసముఁడు రాముండు నీకుఁ
బాలనీయులు నీకులౌ ప్రజలు తలఁప. 24.

---

విత్రస్తుఁడు = మిక్కిలి భయపడినవాఁడు, దౌరాత్మ్యము = దుర్మార్గము,

జన— చాపము దాప మేల సుతసన్నిభుఁడౌ రఘురాముఁడా, దయో
ధ్యాపురి బాల వృద్ధ వికలావనిదేవ సతీ మయంబు గాఁగిన్. 25.

బ్రహ్మచారులు—(తొందరతోఁ బ్రవేశించి) కుమారా! అశ్వ మశ్వమని యేదో యొక భూతము దేశంబుల విన వచ్చుచున్నది. అది మా కిపుడు ప్రత్యక్ష మైనది.

లవు—అశ్వ మని పశు శాస్త్రమందును, సమర విద్యయందును బఠింపఁబడును. ఇది యెట్టిదియో చెప్పుఁడు.

బ్రహ్మ—వినుము—

మ. అలరుం దుంటికి గల్గి తోఁక ; యది యల్లల్లార్చు నెల్లప్పుడుం ;
గలుగుం దానికి దీర్ఘకంధరము ; డెక్కల్ నాలుగే నుమ్ము ; చా
యలఁ బోచల్ తినును ; మావికాయలకు నీడౌ లద్దులల్ వెల్వు ; వ్యా
ఖ్యలి వేలా ? కడు వేఁగ బోవుదను గమ్మా ! గమ్ము దల్వో గెడిన్. 26.

(సమీపించి అజినమును హస్తములను లాగుచున్నారు.)

లవు—(కొంతు కోపగర్వ విస్మయములతో) ఆర్యులారా! చూడుఁడు, చూడుఁడు. వీరిచే నాకర్షింపఁబడుచుంటిని. (తొందరతోఁ బరిక్రమించుచున్నాఁడు.)

అరుం—జన—వత్సా! వేడుకనిండించుము.

కౌస—భగవతీ! వీనినవలోకించక సేవింప నని తలంచితిని. కాని నిందొక వేగ కరిగి మరలి పోవు నాయుష్మంతుని జూతము.

అరుం—దవ్వు చనిన చంచలుం డెట్లు కానవచ్చును?

కంచుకి—(ప్రవేశించి) "ఇని మీరు సమయమున నెఱుంగఁ దగు" నని వాల్మీకి భగవానుఁ డానతిచ్చె.

జన—ఇది యేదో మహాసంభ్రమము గానున్నది. భగవతీ! అరుంధతీ! సఖీ! కౌసల్యా! ఆర్య! గృష్టి! మనయంత నరిగి వాల్మీకి భగవానుని గనుంగొందము.

(వృద్ధవర్గము నిష్క్రమించెను.)

బ్రహ్మ—కుమారా! ఆవిచిత్రమును జూడుము.

లవు—చూచితిని. తెలిసినది. నిక్కముగా నీ యశ్వ మశ్వమేధీయము.

---

వికల=అంగవైకల్యము కలవారు, అవనిదేవ=బ్రాహ్మణులు. కంధరము= కంఠము. అశ్వ మశ్వమని - అశ్వమని పలుకఁబడుచుండునది.

బ్రహ్మ—ఎట్లెఱింగితివి?

లవు—ఓమూర్ఖులారా! శ్రౌతాశ్వమేధ కాండమునఁ బఠింపఁబడినదే! చూడరేమి! వేఱ్వేఱుగా శతసంఖ్య గల్గు కవచవంతులు, దండహస్తులు, తూణధారులు, రక్షింపఁ గలరు. ఈసైన్యంబు నట్లనే కానవచ్చుచున్నది. ఇందు నమ్మకము లేదేనిఁ బోయి యడుగుఁడు.

బ్రహ్మ—ఓహో! ఈ యశ్వము సేనాపరివృతంబై యెందులకై తిరుగుచున్నది?

లవు—(అపేక్షతోఁ దనలో) ఆహా! అశ్వమేధ మని విశ్వవిజేతలగు క్షత్త్రియులకు బలవత్తరంబును, సర్వభూపాల పరిభావకంబును, నగు మహామహిమ. నిశ్చయము.

(తెరలో) క. "తురగ మిది సప్తలోకో
త్తర వీరుండైన దశవదన కుల మూలో
ద్ధరణుని పతాకయొ? భయం
కరమై తగు వీరఘోషణంబో యనరా." 27.

లవు—(వ్యథతో) ఓహో! అక్షరంబు లుద్దీపనంబులుగా నున్నవి.

బ్రహ్మ—ఏమందువు? సామ్రాజుఁడుగదా కుమారుఁడు!

లవు—ఏ మట్లు పల్కుచుంటివి? క్షత్త్రియ సామాన్యమా పృథివి?

(తెరలో) "అఁ! మహారాజుముంగు క్షత్త్రియు లెక్కడ?"

లవు—ఛీ! మూర్ఖులారా!

గీ. ఉండిరే నటు వారల నుంచవయుఁ
డీ విభీషిక నాపుట యెందుకొఱకుఁ?
బలు పలుకు లేల? దగ్గరి బలిమిఁ బట్టి
కడఁగి సారియింతు మీ పతాక నిదె! నేను. 28.

ఓహో! వటులారా! లోష్టములఁ గొట్టి యీ తురంగమును మరలింపుఁడు. ఇది దిక్కులేక గోశ్రాత మృగంబులతోఁ జరించుఁగాత!

పురుషుఁడు—(కొందఱు దర్పములతోఁ బ్రవేశించి) ఏమీ చపలత్వము?—ఏమి చెప్పితివి? తీవ్ర నిర్దయంబు లగు నాయుధీయ పఙ్క్తులు డింభకుఁడు పల్కినవు దృప్త వాక్యమును సైరింపవు. ప్రసన్నాగ్రణ్య వీక్షణానంద పరాయత్త చిత్తుఁడై యుండు వైరిమర్దనుం డగు రాజపుత్త్రుఁడు చంద్రకేతుఁడు చనుదెంచు నంతలో వేవేగ నీ నిబిడారణ్యమునఁ దొలఁగిపొండు.

---

విభీషిక - గదరింపు, దృప్త - గర్వముతోఁ గూడుకొనిన.

బ్రహ్మ—కుమారా ! చాలు నీ తురగముతో; సముజ్జ్వల శస్త్రంబు లగు స్వాయంభువ మహర్షులు ధీయ పరంపరలు కుమారుని దర్శించు చున్నవి. ఇచ్చటి కాశ్రమస్థానము దూరము కాన రమ్ము లేడిగంతులతోఁ బరుగెత్తుకొని పోవుదము.

లవు—(నవ్వి) శస్త్రము లేమి ప్రజ్వలించుచున్నవి ? (ధనువెక్కుడి)

మ. స్థిర దంష్ట్రోత్కట కోటి మధ్య విచల జ్జిహ్వోజ్జ్వల చ్ఛింజినీ
స్ఫురితోద్గారి ఘనాళి ఘర్ఘర రవ స్తోమాస్పదంబై, చరా
చర భూత గ్రసనోద్య దంతక హాస చ్చండాస్య యంత్రప్రభా
స్వర జృంభా విపులోదరం బగుచు నీ చాపంబు దీపించుతన్. 29.

(వికటముగాఁ బరిక్రమించి అందఱు నిష్క్రమింతురు.)

కౌసల్యా జనక సమాగ మను

చతుర్థాంకము,

సంపూర్ణము.



స్థిర=దృఢమైన, దంష్ట్ర=కోరలవలె, ఉత్కట=భయంకరమగు, కోటి = చాపాగ్రముల యొక్క, మధ్య=మధ్యమందు, విచలత్=చలించుచున్న, జిహ్వా = నాలుకవలె, ఉజ్జ్వలత్=ప్రకాశించుచున్న, శింజినీ=నారివలన, స్ఫురిత=వెడలుచున్న, ఉద్గారి = తేనుపువంటి, ఘనాళి=మేఘసముదాయము యొక్క, ఘర్ఘరరవ=ఘర్ఘర ధ్వనుల యొక్క, స్తోమ = సముదాయమునకు, ఆస్పదంబై = స్థానమై, చరాచరభూత గ్రసన = ప్రపంచభక్షణమందు, ఉద్యత్ = ప్రయత్నించుచున్న, అంతక = యముని యొక్క, హాసత్ = అట్టహాసము చేయు, చండ = భీకరమగు, ఆస్యయంత్ర = యంత్రమువంటి ముఖము యొక్క, ప్రభాస్వర=మిక్కిలి వికసించిన, జృంభా=ఆవులింతవలె, విపుల = విశాలమయిన, ఉదరంబగుచు = మధ్యభాగము గలదై, ఈచాపంబు—దీపించుతన్ = ప్రకాశించుఁగాక !



# ఆంధ్రీకృతోత్తర రామచరిత్రము.

## పంచమాంకము.

(తెఱలో) ఓహో! సైనికులారా! కల్గినది మన కాధారము గల్గినది.

గీ. సరభస సుమంత్రి చోదనో త్తరళ జవన
హయ రథముతోడ మన కయ్యమాలకించి
చంద్రకేతుండు విషమ భూచలిత కోవి
దార తరు కేతుఁడై యిదే! తరలి వచ్చె. 1.

(అద్భుత హర్ష సంభ్రమములతో ధనుర్ధరుండగు చంద్రకేతుండు సుమంత్రి సారథికం బగు రథంబునం బ్రవేశించును.)

చంద్ర—ఆర్య! సుమంత్రా! చూడు చూడు! —

మ. సముదంచ న్మృదు పంచచూడుఁ డగు నోజశ్శాలి యీ బాలుఁ, డీ
సమరక్షోణి నుపాత్త రోష లవ రజ్యద్వక్త్ర లక్ష్మీకుఁడై,
నమితోద్దామ శరాసనాగ్రములు సాంతత్యంబునం మోయ సై
న్యముపై బాణ తుషారముం బరపె నుద్యత్ప్రౌఢి నీఁ డెవ్వఁడో? 2.

---

చోదన = త్రోలుటవలన, ఉత్తరళ=పరుగెత్తుచున్న, జవన = బలిష్ఠమయిన, విషమభూచలిత =ఎచ్చుతగ్గు భూములయందు చలించుచున్న, సముదంచత్ = ఒప్పుచున్న, పంచచూడుఁడు = పంచశిఖలుకలవాఁడు, ఓజశ్శాలి = తేజోవంతుఁడు, ఉపాత్త = పొందఁబడిన రోషము యొక్క, లవ = లేశముచేత -ఎఱ్ఱఁబారిన-ముఖ-శోభగలవాఁడై, నమిత=వంచఁబడిన. విల్లుయొక్క - కొనలు - ఎడతెగక - ధ్వనిచేయఁగా, తుషారము = మంచు.

చ. ముని జన బాలుఁ డొక్కఁడు చమూ తనుభాగము లెల్ల నుల్లస
ద్ఘన గజ గండ పిండ గురు ఘాతజ టంకృతి భీకరార్భటిన్
గొనకొని బాణసంఘముల గూర్చుచు మున్ విదితంబుగాని నూ
తన ధనుర్ధర ట్రుక్రొలాకున విధంబున దాను ముదంబు గూర్చెడున్. 3.

సుమం.—ఆయుష్మంతుఁడా ! —

గీ. క్షితి సురాన్వయ మహిమల నతిశయించి
యీశ సమరూపుఁ డైన నిన్ను విలకించి
కాశి కావేర వైరి సంగ్రామ మందు
తనువుఁ బాసిన రఘునందనుని స్మరింతు. 4.

చంద్ర.—నిన్ను నొక్కని గూర్చి సుయుద్ధమునకుఁ గార్యారంభ మని శౌండము లజ్జించుచున్నది.

చ. సమర విధాన నిర్వహణ శక్త కరాంచల దీప్త శస్త్రసం
ఘములును, నిక్వణ ద్విహాళి కాంచన కింకిణికా ఝణంఝణ
త్తుముల రథంబు, లిద్ధ మద దుర్దిన కుంజర వారిదంబు లౌ,
నమిత బలంబులం బిహితుఁ డయ్యెడి నీ సుకుమారుఁ డెక్కటిన్. 5.

సుమం.—కుమారా ! వీర లెదుట శోకీభవించిన నీని కేమి ? —విచ్చిరేని మునుపే లేదు.

చంద్ర.—ఆర్యా ! త్వరపడుము త్వరపడుము. ఇతఁడు మన సైనికుల హింసింపఁ జొచ్చె. అల్లదే !

---

చమూతను భాగములు = సేనాంగములు, ఉల్లసత్ = ప్రకాశమానమగు, గొప్పవ యిన - ఏనుఁగుల యొక్క - చెక్కిళ్ళయొక్క - ఉండల యొక్క - గొప్పదగు - దెబ్బ వలన - పుట్టిన - టంకారధ్వని యొక్క - భయంకరమగు - చప్పుడులతో, ఎదిరించి.

కరాంచల = చేతికొనలయందు, నిక్వణత్ = ధ్వనిచేయుచున్న, కింకిణికా = చిఱుగంటల యొక్క, తుముల = విస్తారములగు, ఇద్ధ = ప్రశస్తమైన, మద = మదముచేత, దుర్దిన = మసుగుగాఁ జేయఁబడిన, కుంజర = ఏనుఁగులనెడు, వారిదంబులౌ = మేఘములుగల, పిహితుఁడు = ఆవరింపఁబడినవాఁడు, ఎక్కటిన్ = అసహాయుఁడై.

చ. గురుతర దుందుభి ధ్వని విఘూర్ణితమై, గిరికుంజ గుంజ దు
ద్ధుర మద కుంజర శ్రవణ దుస్సహమా గుణఘోష మెల్లెడం
బఱపుచు, లోల భీషణ కబంధ శిరంబులఁ దృప్త కాల భీ
కర ముఖ భుక్తశేషముల కైవడి నింపె నితండు భూములన్. 6.

సుమం—(తనలో) ఇట్టి వానితో నర్భకుం డగు చంద్రకేతునకు ద్వంద్వయుద్ధ మె ట్లుసమ్మతింతును ? (యోజించి) లేదా ? ఇక్ష్వాకు గృహవృద్ధులముగదా మేము! సంభవించి నప్పు డేది గతి ?

చంద్ర—(విస్మయ లజ్జా సంభ్రమములతో) ఛీ ! నాసైన్యంబు లెల్ల మరలి పోయినవి.

సుమం—(రథవేగము నభినయించుచు) ఆయుష్మంతుఁడా ! ఇదే ! ఆ వీరుండు నీకు వాగ్గోచరుండయ్యె.

చంద్ర—(విస్మృతి నభినయించి) ఆర్యా! ఆఖ్యాయకులు వీనినామధేయము నేమని తెల్పిరి ?

సుమం—లవుఁ డని.

చంద్ర—గీ. అద్దిరా ! లవ ! శూర ! మహాభుజాంక !
నీకు ఫలమేమి యిట్టి సైనికులతోడ ?
ఇదిగో ! నే వచ్చినాఁడ న న్నెదురు మిపుడు
తేజము శమించుఁగాక ! మా తేజమందు. 7.

సుమం—కుమారా ! చూడు చూడు.

గురుతర = మిక్కుటమగు, దుందుభిధ్వని చేత, ఘూర్ణితమై = ప్రతిధ్వని చేయుచున్నదై, గిరి = పర్వతములయందలి, కుంజ = పొదలయందు, గుంజత్ = ధ్వని చేయుచున్న, ఉద్ధుర = విశేషమైన, మదకుంజర = మదపుటేనుఁగుల యొక్క, శ్రవణ = చెవులకు, దుస్సహమా = సహింప శక్యముగాని, గుణఘోషము = నారియొక్క ధ్వని ఎల్లెడంబఱపుచు, లోల = చలించుచున్న, భీషణ = భయంకరమగు, కబంధ = మొండెముల చేతను, శిరంబులన్ = తలలచేతను, తృప్త = సంతృప్తి పొందిన, కాల = యముని యొక్క, భీకర = భయంకరమగు, ముఖ = నోటిచే, భుక్తశేషములకైవడిన్ = తిని విడువఁబడిన వానివలె, వాగ్గోచరుఁడు = కేకకందునట్టి దూరమున నున్నవాఁడు, ఆఖ్యాయకులు = చెప్పువారు.

గీ. నీవు జీరిన తోడ సైనిక వనంబు
మాని యీ బాలవీరుండు మగిడి వచ్చె;
ఘన నినాదంబు విని గజాఘాత ముడిగి
వడి నెదురు దృప్త సింహ శాబకము వోలె. 8.

(పిదప వేగోద్ధత క్రముండై లవుఁడు ప్రవేశించును.)

లవు—మంచిది కుమారా! మంచిది. విక్రమముగా సైన్యాధ్యక్షుఁడ వైతివి. కాన నిదిగో! యెదుర వచ్చితిని. (తెరలో గొప్ప కలకలము) (రోషముతో వెనుక మరలి) ఆఁ! ఇపుడు పరాజితు లయ్యును సమర వర్ధు లగు సేనాధినాథు లందఱును మరలి వచ్చి చుట్టువారి చెండుచుండిరేమి? ఛీ! మూర్ఖులారా!

వ. ప్రళయ మరుద్విభగ్న జలరాశి తరంగంబును బోలె నెల్లెడం
గొలగొలఁ జుట్టుముట్టుకొని ఘూర్ణిలు సైనిక ఘోష మున్నతా
చల పరిఘాత సంక్షుభిత సంకుల బాడబ వహ్ని పావకో
జ్జ్వలిత మదీయ రోష సముదార శిఖాహుతి నొందు గావుతన్. 9.

(పరిక్రమించును.)

చంద్ర—ఓహో! కుమారా!

చ. అతివిపులాద్భుతంబు నిడునట్టి గుణాతిశయంబుఁబట్టి స
మ్మతుఁడను గాన మిత్రుఁడను మాయది నీయది గాదె! కాన నీ
గతి నిజభృత్యులందు రణకాంక్ష లివేటికి? నపరాక్రమా
యతి కిదె చంద్రకేతుఁ డగయాన్ నికషంబుగ వచ్చె నేఁడెదురన్. 10

చీరిన=పిలిచిన, ఘననినాదంబు=మేఘధ్వని, గజాఘాతము=ఏనుగునుచంపుట, దృప్త=గర్వించిన, శాబకము=పిల్ల, ప్రళయకాలమునందగు వాయువుచేఁదునుఁగఁగొట్టఁబడిన సముద్రప్రవాహమువలె, అంతటనావరించి ధ్వనిచేయు సేనాధ్వని, ఉన్నత=ఎత్తయిన, అచల=కొండయొక్క, పరిఘాత=తాకుడువలన, సంక్షుభిత=కలఁతపెట్టఁబడుటచేత, సంకుల=వ్యాపించిన, బాడబవహ్నిపావక=బడబాగ్నివలె, ఉజ్జ్వలిత=మిక్కిలిమండుచున్న, మదీయ=నాయొక్క, రోష=కోపమనెడు, సముదార=విశేషమయిన. శిఖా=జ్వాలకు.

ఈపద్యమున, లవకుమారుని పర్వతముగాను, చంద్రకేతు సైన్యమును సముద్రముగాను, వీరి సంఘర్షణమువలన వెలువడు లవుని రోషాగ్నిని బడబానలముగాఁ బోల్చి సైన్యజలములను హరించుచుండెనని వర్ణింపఁబడినది, అయతికి=అతిశయమునకు, నికషము=ఒరపిడిరాయి.

లవు—(హర్ష సంభ్రమములతో మరల) ఓహో! మహానుభావుఁడగు భాస్కర కుల కుమారుని సౌమ్య నిష్ఠురం బగు వీరవాక్పరిపాకము! కాన వీరితో నేమి? వీనినే బహూకరించెదను. (మగలఁ దెంబలోఁ గలకలము) (క్రోధనిర్వేదములతో) అరే! వీరసంవాదమున కంతరాయము గల్గించు పాపాత్ములచే నిగర్థకుండ నయితిని. (సేనవైపునకుఁ బరిక్రమించు చున్నాఁడు)

చంద్ర—ఆర్యా! యీ దర్శనీయమును గనుంగొనుము.

చ. మును ఘనమోద దర్శనులు బొందఁగ నాయెడ బద్ధ లక్ష్యుఁడై,
వెనుక మదీయ సైన్య పరివేష్టితుఁడై విలుసెక్కు నెట్టు ని
య్యనఘుఁడు, మారుతద్వయ సమాహృతమై యురివాఁడు గోత్రభి
ద్ధను రభిదీప్తమైన జలదంపు సిరిన్ ధరియించె మించుగన్. 11.

సుమం—కుమారుఁడే వీనిఁ దేరి చూచుట కైనఁ బరిజ్ఞాత; మేమో కేవల విస్మయ పరవశులము.

చంద్రి—ఓహో! రాజులారా!

చ. అగణిత వాహ కుంజర శతాంగ నివిష్టులు, వర్మితాంగులుం
బ్రగుణ వయోఽతిరిక్తు లగు వారలు మీ, రితఁ డొక్కరుండు, బా
లగుఁడుఁ బవిత్రచర్మ పటధారి, కిశోర తనుండు, వీనితో
మొగకొనఁ జేయు సన్నహనముం గన మీకును నాకు సిగ్గగున్. 12.

లవు—(కష్టముతో) ఇయ్యఁ దలఁచెనా యేమి? (చింతించి) ఔఁ గాక! కాలహరణ నివారణార్థమై జృంభకాస్త్రంబుచే నిపుడు సైన్యముల మూర్ఛిల్లఁ జేసెదను. (ధ్యానము నటించును.)

---

మారుతద్వయ = రెండుగాలులచే, గోత్రభిద్ధనుః = ఇంద్రధనుస్సుచేత, అభిదీప్తమైన=ప్రకాశించుచున్న, జలదంపు సిరిన్ = మేఘముయొక్క శోభను.

అగణిత = లెక్కలేని, వాహ = గుఱ్ఱములను, కుంజర = ఏనుఁగులను, శతాంగ = రథములను, నివిష్టులు = ఎక్కినవారు, వర్మితాంగులు = కవచములు ధరించినవారు, ప్రగుణ = మంచిగుణములచేతను, వయః = వయస్సుచేతను, అతిరిక్తులు = మించినవారు, చర్మపటధారి = చర్మ వేష వస్త్రము గాఁ గలవాఁడు, కిశోరతనుఁడు = పిన్న వయసు—...

సుమం—అదేమి ? సైన్యఘోష మాకస్మికముగాఁ జల్లారినది ?

లవు—ఈ దర్పహారు నిపుడు చూచెదను.

సుమం—వత్సా ! యీ కుమారుఁడు జృంభకాస్త్రము నామంత్రించె నని తలంతును.

చంద్రి—ఇందు సందియంబేమి ?

గీ. ఇరులు మెఱపులు మెండుగా బెరసినట్లు
గాంచు కను మిర్రిగి విడిచిన గతిఁ గలంచెఁ
జిత్తరువుఁ దోల్చి బలముల చేష్ట లుడిపె
నా ! మహాతేజ మగు జృంభకాస్త్రములు. 13.

సుమం—ఆశ్చర్య మాశ్చర్యము ?

మ. బలి సద్మాంతర కుంజ పుంజిత తమః పరిస్ఫారముల్, తప్త పి
త్తల పింగద్యుతి దీపితంబు లసదుద్యజ్జృంభకాస్త్రంబులుం
బ్రబల యాభీల మహా మరుచ్చలములౌ వార్వాహ విద్యుత్పిశం
గ లసత్కందర వింధ్యకూటముల రీతిన్ మిన్ను గప్పంబడెన్. 14.

వీనికీ జృంభకాస్త్రంబు లెచటనుండి వచ్చినవి ?

చంద్ర—భగవంతుఁడగు ప్రాచేతసుని నుండి యని యూహింతును.

సుమం—వత్సా ! ఈతని కస్త్రవ్యవహారము లేదు. జృంభక సాంప్రదాయము మనుపే లేదు. ఏమనఁ ?

గీ. ఇవి కృశాశ్వ సహస్రాంశు శిష్యుఁడౌను
నుండి కుశికతనూభవు నొద్దఁ జేరి

---

ఇరులు=చీఁకట్లు, ఒలసె = ప్రకాశించెను, బలిసద్మాంతర—పాతాళమునందలి, కుంజ=పొదరిండ్లయందు, పుంజిత = కూడుకొనిన, తమః—చీఁకట్లయొక్క, పరిస్ఫారముల్ = ఎక్కువలు, తప్త=కరిగిన, పిత్తల=ఇత్తడియొక్క, పింగ = పసిమివర్ణము యొక్క, ద్యుతి = కాంతిచేత, దీపితంబులు=ప్రకాశించుచున్నవియునగు, ఉద్యత్ = ప్రకాశమానములయిన, జృంభకాస్త్రంబులచేతను, ప్రళయ = ప్రళయకాలమందయిన, ఆభీల=భయంకరమగు, మహా = గొప్పవయిన, మరుత్=వాయువులచేత, చలములౌ= చలించుచున్నట్టివగు, వార్వాహ = మేఘములయొక్క, విద్యుత్ = మెఱుపులచేత, పిశంగ = పచ్చనైన, లసత్ = ఒప్పుచున్న, కందర = గుహలుగల, వింధ్య = వింధ్య పర్వతముయొక్క, కూటములు=శిఖరములయొక్క, రీతిన్ =రీతిని, మిన్ను—ఆకాశము, కప్పంబడెన్ —ఆవరింపఁబడెను. ఆశ్చర్యంబులు—సంతానములు.

సంతటఁ దదీయ సంప్రదాయంబు వలన
రామభద్రుని యందుఁ దిరంబులయ్యె. 15.

చంద్ర—నిరతిశ యోజ్జ్వల సత్త్వ ప్రకాశకులగు మఱికొందఱు మాత్ర దర్శనములఁ గూడఁ దమ దామ చూచుచుందురు.

సుమం—వత్సా ! జాగరూకుఁడవు గమ్ము. వీరశేఖరుండు మరలివచ్చె.

లవు—చంద్ర—(పరస్పరము దమలో) ఓహో ! సౌమ్యదర్శనుం డీ కుమారుఁడు

(స్నేహానురాగములతోఁ జూచి)

మ. ఇది యాదృచ్ఛికమో ? గుణాతిశయ సాహిత్యంబో ? జన్మాంతరా
భ్యుదిత ప్రాక్తన సాంద్ర సౌహృద రసంబో ? దైవతంత్రింబునన్
మదిలో వేద్యముగాక యున్న నిజబాంధవ్యానుబంధంబో ? నా
హృదయం బీతని గాంచి నంత నె సమాకృష్టం బగుస్ బ్రేల్మిడిన్. 16.

సుమం—ఒకొక్కని కొక్కొక్కనియెడల సరసానురక్తి గల్గుట తెలుచుగాఁ బ్రాణిధర్మము. దీనినే తారామైత్రమనియుఁ జక్షూరాగమనియు లౌకికులు వ్యవహరింతురు. అట్టి ప్రేమ నవిజ్ఞేయమనియు నిర్హేతుకంబనియుఁబలుకుచున్నారు.

గీ. వీనహేతుక మగు పక్షపాతమునకుఁ
దగు ప్రతిక్రియ యొంగును దారసిల్ల
పదియె స్నేహాత్మకపు సూత్ర మగుచు జనుల
హృదయ మర్మప్రదేశంబు లెల్లఁ గూర్చు. 17.

చంద్ర—లవు—(అన్యోన్యము స్వగతము.)

గీ. ఉల్లిఖిత రాజపట్ట విద్యుతులు గమ్ము
నితని నెమ్మేన బాణంబు లెట్లువిడుతు ?

---

ఆదృచ్ఛికమో=స్వేచ్ఛాసంభవమో, సాహిత్యంబో=తృప్తియో, జన్మాంతరమునుండి, అభ్యుదిత=పుట్టిన, ప్రాక్తన=పురాతనమైన, సాంద్ర=దట్టమైన, సౌహృదరసంబో=ప్రేమసారమో, వేద్యముకాక యున్న=తెలియని, సమాకృష్టంబు=ఆకర్షింపఁబడినది, వ్రేల్మిడి=చిటికెలో, వీతహేతుకము=కారణరహితము, రాజపట్టము=ఆభరణవిశేషము.

దీని జూచిన పరిరంభ తృష్ణవలన
నాదు తనువెల్లఁ బులక సంతతుల బెరసె. 18.

చ. అనుగత ఘోర వీర్యానెడ నస్త్రముగాక మఱేది దిక్కు? పెం
పెనసిన యస్త్ర మేటి కిఁక నిట్టి శరవ్యము నాటదేని? యే
మను నితఁడే శరంబుఁగొన నాజి దొరంగిన నన్ను? స్నేహ వ
ర్తనము దొలంచు దారుణతరం బగు వీర విహార మెన్నఁడున్. 19.

సుమం—(లవునిఁ జూచి కన్నీళ్ళతోఁ దనలో) హృదయమా! వేఱు తలంతు వేమి?

క. తొలుత మనోరథ బీజము
పొలిసెఁ విధివశము వలనఁ; బూర్వంబె విని
ర్దళితం బగు లతకూనకుఁ
గలుగునె కుసుమోదయంబు కడుఁ జింతింపన్. 20.

చంద్ర—ఆర్య! సుమంత్రా! రథము నుండి దిగుచుంటిని.
సుమం—కారణం బేమి?

చంద్ర—ఈ వీరపురుషుండు పూజితుం డగును. మఱియు నార్యా! క్షాత్రధర్మ మనుగ్రహింపఁ బడిన దగును. "పాదచారునితో రథికు లాయోధనం బొనర్ప" రని శాస్త్రవేత్తలు పలుకుచున్నారు.

సుమం—(తనలో) కష్టా! కష్టదశను బొందినవాఁడ నైతి.

క. నను బోఁటి పురుషుఁ డీగతిఁ
బనివడి ధర్మక్రమంబు వలదని మాన్పన్;
సున సాహసైక గస మనఁ
జను కృత్య మొనర్చె నెట్లు సమ్మతిగాంచున్. 21.

చంద్ర—తాతమిత్త్రులు సయితముఁ దండ్రికిఁ బ్రియసఖుండ వగు నార్యునే ధర్మసంశయంబులం దడుగుచుందురు. అట్టి యార్యుఁడే విమర్శించుచుండె నేమి?

---

దీని = ఈశరీరమును, బెరసె = వ్యాపించెను, శరవ్యము = బాణము నాటుట కర్హమైనస్థానము, వినిర్దళితంబగు = తుంచఁబడిన, ఆయోధనము = యుద్ధము.

సుమం—ఆయుష్మంతుఁడా ! ధర్మ్యమే తలంచితివి.

క. ఇదియే సమరన్యాయం
బిదియే సనాతన మనంగ నెసఁగిన ధర్మం
బిదియే రఘుసింహంబుల
సదమల శౌర్యాపదాన సరణియు నుమ్మా. 22.

చంద్ర—ఆర్యవచన మనురూప మైనది.

క. ఇతిహాసములుఁ బురాణ
ప్రతతియు విఖ్యాత ధర్మవచనంబులు వి
శ్రుత రఘురాజ కుటుంబ
స్థితియును నీ హృదయమునకె తెలియునుగాదే ? 23.

సుమం—(స్నేహ బాష్పములతోఁ గౌఁగిలించుకొని)

ఉ. నందన ! యింద్రజిజ్జయసనాథుఁడు బాలుఁడు నీదు తండ్రి పెం
పొందఁగ జన్మమంది యిపు డొయ్యన నెన్ని దినంబు లయ్యెఁ ? బ
న్నందనుఁడుం బ్రవీర చరితంబు గెరల్చుచు నుండె నా! దశ
స్యందను నన్వయంబు మునుమారఁ బ్రతిష్ఠ వహించె నయ్యారే ! 24.

చంద్ర—(కష్టముతో)

గీ. క్షితి రఘుజ్యేష్ఠుఁ డప్రతిష్ఠత వహింప
మొనయునె ప్రతిష్ఠ మాకులంబున కటంచుఁ
దక్షు ముష్వురు మాతండ్రు లొక్కభంగి
నుల్లమునఁ బెల్లు దురపిల్లుచుందు రెపుడు. 25.

సుమం—అహహా ! ఈ చంద్రకేతు వచనంబులు హృదయ మర్మముల భేదించుచున్నవి.

లవు—ఆహా ! రసవర్తనము సంకీర్ణముగా నున్నది.

చ. అలరు సుధాంశునందు ముదమందు కుముద్వతి వోలె వీనియం
దలరె మనీయ దృష్టి, కలహప్రియఘోరకఠోరధాటి ను

అపదానము=చారిత్రము, అప్రతిష్ఠత=సంతానము లేకపోవుట, సంకీర్ణము=కలగలుపు, సుధాంశుఁడు = చంద్రుఁడు,కుముద్వతి=కలువ, కలహప్రియ = యుద్ధమం దిచ్చగల, ఘోర = భయంకరమగు, కఠోర = తీక్ష్ణమైన, ధాటిని =శౌర్యము చేత.

చ్ఛలిత ఝణంఝణ క్వణిత దారుణ సార గుణోరుచాపమై
జ్వలిత విభీషణోల్బణ రసంబగు నా భుజ మూర్జిఁ గోరెడిన్. 26.

చంద్ర—(దిగుచు) ఆర్యా! సవిత్సవంశ్యుఁ డగు చంద్రకేతుఁడు నమస్కరించుచున్నాఁడు.

సుమం—గీ. గమ్ము శాశ్వత దివ్య వరాహమూర్తి
దుర్జయంబుఁ బవిత్రంబు నూర్జితంబు
నైన తేజంబు నీవు శ్రేయంబు గాంచుఁ
గొడవరఁ జేయుత నల కకుత్థ్సునకుఁబోలె. 27.

మఱియు—

వ. పరముఁడు గోత్రకర్త యగు భానుఁ డనిన్ నిను పొచ్చరించు, నీ
గురుపులకుం గురుండు ననఘుండు వసిష్ఠుఁడు నిన్ను మెచ్చు, శ్రీ
హరి సుగపాగ్ని మారుత ఖగాధిప తేజముఁ జెందు నిన్ను, బం
ధురతర గామ లక్ష్మణ ధనూరవ మంత్రము జిష్ణుఁ జేయుతన్. 28.

లవు—కుమారా! తేరుననుండియే మిగుల శోభిల్లుచుంటివి. చాలు చాలు నత్యాదరము.

చంద్ర—అట్లయిన మహాత్ముండు గూడ వేఱొక రథంబు నలంకరించుఁగాక!

లవు—ఆర్యా! రథముపై రాజపుత్త్రు నధిష్ఠింపఁ జేయుము.

సుమం—చంద్రకేతు వచనమును నీవుఁ గూడ ననుసరింపుము.

లవు—నా యుపకరణంబుల యెడల నభ్యంతరం బేమి? మఱేమన? మే మరణ్యవాసులము గాన రథచర్య నెఱుంగము.

సుమం—వత్సా! వర్ప సౌజన్యముల యథోచితంబుగా నిర్వహింప నభిజ్ఞుండవు; ఇట్టి నిన్ను నైక్ష్వాక నృపాలుం డగు రామభద్రుండు విలోకించెనేని వాని హృదయంబు స్నేహార్ద్రంబుచేఁ గరఁగి యుండెడిగి.

---

ఉచ్ఛలిత = మిక్కిలి కదలుచున్న, ఝణంఝణక్వణిత=ఝణఝణయనిధ్వని చేయుచున్న, దారుణ=భీకరమగు, సార=సత్త్వముగల, గుణ = నారిగల, ఉరు = గొప్పదియగు, చాపమై = ధనుస్సుగలదై, జ్వలిత = ప్రజ్వలించుచున్న, విభీషణ = మిక్కిలి భయంకరముయొక్క, ఉల్బణ = అతిశయముతోఁ గూడిన, ఊర్జితంబు = బలవత్తరమైనది.

శ్రీహరి = వైష్ణవాస్త్రము, సుగప = ఐంద్రాస్త్రము, అగ్ని = ఆగ్నేయాస్త్రము, మారుత = వాయువ్యాస్త్రము, ఖగాధిప = గారుడాస్త్రము.

లవు—ఆర్యా! ఆరాజర్షి సుజనుం డని వినవచ్చెడి (లజ్జతో)

చ. అరయఁగ మేము నిట్టి క్రతుహంతల మేనియుఁ గాము ; ధాత్రి న
న్నరపతి సే నరుఁడు సుగుణంబుల మన్నన నేయకుండు ? నా
వరుసఁ దురంగ రక్షకుల వాక్య మశేష నృపావళీ తిర
స్కరణ కఠోరమై నను వికారము నొందఁగఁ జేసె నేఁడిటన్. 29.

చంద్ర—(చిఱునవ్వుతో) ఏమీ నీకుఁ బితృ విక్రమోత్కర్షంబునం గూడ నమర్షమా?

లవు—ఇం దాగ్రహం బుండని, లేకపోనీ, ఇది ని న్నడుగుచుంటిని. రఘుకులేశ్వ రుండు దాంతుఁడని విందుము. అతఁడు దను దాన గర్వింపఁడు. వాని ప్రజలయం దును దర్పంబు సంభవింపదు. అట్లుండఁ దత్సేవకులు రాక్షస వచన మేల పల్కిరి?

గీ. తపసు లున్మత్త దృప్తుల దారుణంపు
భాషితము రాక్షస మటంచుఁ బల్కుచుండ్రు,
సర్వ విద్వేషములకు బీజ మగు నదియొ,
యొల్ల భువనంబునకు నదియే యలక్ష్మి. 30.

ఇట్లు వీనిని నిందించుచుఁ దదితరముల స్తోత్రము చేసిరి.

గీ. కోరిక లొసంగు, నవలక్ష్మిఁ బాఱఁదోలు,
యశముఁ గను, దుష్కృతంబు రూపరఁగఁ జేయు
నట్టికల్యాణజనని, సత్యంపు వాణి
ధీరులు వచించెదరు కామధేనువనుచు. 31.

సుమం—పావన స్వభావుండును, బ్రాచేత సాంతేవాసియు నగు ఏ కుమారకుండార్ష సంస్కారంబునం బరిపూర్ణంబుగాఁ బల్కుచున్నాఁడు.

లవు—చంద్రకేతూ! "నీకుఁ బితృ విక్రమోత్కర్షంబునం గూడ నమర్షమా" యని పల్కినదానిం గూర్చి ప్రశ్నించు చుంటిని. క్షత్రధర్మములు నియమిత విషయంబు లా యేమి ?

సుమం—ఐక్ష్వాక సార్వభౌము నించుకేని యెఱుంగవు గానఁ జాలింపు మతిప్రసం గము జాలింపుము.

దాంతుఁడు = అంతరింద్రియనిగ్రహముగలవాఁడు, ఉన్మత్తులు = పిచ్చివారు, దృప్తులు = గర్వితులు, అలక్ష్మి = పెద్దమ్మ, అంతేవాసి = శిష్యుఁడు.

క. నిక్కము సైనిక వీరుల
నుక్కణఁచి పరాక్రమంబు నొలయించితి నీ
వక్కట ! భార్గవ దమనుని
చక్కటి మితిమీఱి పల్క సరసంబగునే ? 32.

లవు—(నవ్వుచు) ఆర్యా ! ఆభూపాలుఁడు భార్గవ దమనుఁ డని యీశ్లాఘనం బేటికి ?

చ. ద్విజులకు భాషణంబుననె వీర్యము గల్గు నిసర్గశైలి; భూ
భుజుల కుదార బాహువులఁ బొల్పగు వీర్యము; శస్త్రపాణియున్
ద్విజుఁడును నైన భార్గవుని పెం పణఁగించి రఘూద్వహుం డనిన్
విజయముఁ గాంచె నంచుఁ బృథివీపతి కేమి యశంబు దానిచేన్. 33.

చంద్ర—(ఉన్మత్తునివలె) ఆర్య ! ఆర్యా ! చాలు నుత్తరోత్తరంబుల;—

మ. భగవంతుం డగు భార్గవుండు నతికిం బాత్రుండు గా డేనికిన్?
జగతీ సప్తక నిర్భయాకలన దీక్షా దక్షిణాపూర్ణతం
దగు నైక్ష్వాక నరేంద్ర పావన చరిత్రంబుల్ వినం డెవ్వఁ ? డా
నుగుణుం డిప్డిశఁ డెవ్వఁడో ? నవ మహాశూరావతారంబులో ? 34

లవు—రఘునరేంద్రుని చారిత్ర మహత్త్వంబు లెవ్వఁ డెఱుంగఁడు ? కాని యించుక వివరించ వలయునా ?

ఉ. చాలును; వారు వృద్ధు లవిచార్య చరిత్రు లటంచు వర్ణనం
బేల ? సుబాహు మాత్ప హనన నేద్ధ యశుల్ ధర నమ్మహామహుల్;
బాలి ఖరాజి మూఁడడుగులన్ మును ద్రొక్కుట, నేర్పుతోడుతన్
వాలిని దుర్గ నేయుటయు వారిరి లోక మెఱుంగ కున్నదే ? 35

చంద్ర—అఁ ! పితృదూషణాతిలంఘితమర్యాద ! మితిమీఱి ప్రగల్భంబు లాడుచుంటివి !

లవు—ఓహో ! నాయెడలనే భ్రుకుటీధరుండయ్యె.

---

దమనుఁడు = జయించినవాఁడు, హనన = సంపుటయందు, ఇద్ధ = ప్రసిద్ధమయిన, యశుల్ = కీర్తికలవారు,. ఖరునితో యుద్ధము చేయునప్పుడు, శౌర్యపద్ధతికి విరుద్ధముగా రామభద్రుఁడు మూఁడడుగులు వెనుకకు జంకెను. దాని నేయుచ్చుట హేళనగా మును ద్రొక్కియని పలికినాఁడు. భ్రుకుటీధరుఁడు = కనుబొమలు ముడివయిచినవాఁడు.

సుమం—వీరికిఁ గోధ మస్తిన్న మైనది. అల్లదే !

చ. కరకరిఁ బుట్టు కంపము శిఖావలయంబు గదల్చుచుండెఁ; గ
ట్టెఱుపు వహించి కన్నుగొన లేర్పడెఁ జెందొవ రేకులట్టు; లు
త్తరళము లైన భ్రూకుటులఁ దాల్చ మొగంబు ప్రఫుల్ల లాంఛన
స్ఫురిత హిమాంశునిన్ భ్రమర శోభిత సారసమున్ హసించెడిన్. 38.

లవు—చంద్ర—కాన నిందుండి సమర సమ్మర్దోచిత ప్రదేశంబుఁ జొత్తము.

(అందఱు నిష్క్రమింతురు.)

కుమార విక్రమ మను పంచమాంకము,

సంపూర్ణము.



కరకరిన్=కూరగభావమున, శిఖావలయంబు=జుట్టుముడి, చెందొవ=ఎఱ్ఱకలువ, ఉత్తరళములయిన=మిక్కిలిదట్టమయిన, ప్రఫుల్ల=వృద్ధిబొందిన, లాంఛన=మచ్చచేతను, స్ఫురిత=తెలుపుడిచేయఁబడుచున్న, హిమాంశునిన్=చంద్రుని, భ్రమర=తుమ్మెదలతో, శోభిత=ప్రకాశింపఁజేయఁబడిన, సారసమున్=పద్మమును, హసించెడిన్.



# ఆంధ్రీకృతోత్తర రామచరిత్రము.

## షష్ఠాంకము.

(పిదప నుజ్జ్వల విమానముతో విద్యాధర మిథునము ప్రవేశించును.)

విద్యాధర—ఓహో! అకాండ కలహ ప్రచండులై, పరిమండిత క్షాత్ర లక్ష్మీకు లగు మార్తాండ కుల కుమారుల విక్రమ చరిత్రంబులు దేవాసురాశ్చర్య ధుర్యంబులై వర్ధిల్లుచున్నవి; అల్లదే! ప్రియా! చూడు చూడు!

ఉ. కలిత ఝణంఝణా రణిత కంకణ నిక్వణ కింకిణీ సమా
కుల గురు శింజినీ ముఖర కోటి కరాల విరావ చాప మ
గ్గలముగ వంచి, చంచల శిఖుల్ నిగుడన్ విశిఖంబు లేయుచుం
గల భువనైక భీమ సమరం బ విచిత్రగతిం బ్రవర్ధిలెన్. 1.

క. ఉభయుల శుభమునకై దుం
దుభి నాదము చెవిని సోఁగ నందు న్మ్రోయుచున్
విభవమున నభ్రిరవ స
న్నిభమై గాంభీర్య మాననీయం బగుచున్. 2.

కాన నిరంతర నిబిడ మంజుల వికసిత హేమారవిందు భాసుర శ్రేణిద్యై, దేవ తరు తరుణ మణి ముకుళ నికర మకరంద బిందు సుందరంబగు కుసుమ వర్షంబు వీరి పైఁ బఱగింపుము.

---

అకాండ=కారణము లేని, రణిత = ధ్వని చేయుచున్న, నిక్వణ=ధ్వనితోఁ గూడిన, కింకిణీ=చిఱుగంటలచే, శింజిని=ధనువుయొక్క, ముఖర = ధ్వనిచేయుచున్న, కోటి = ధనురగ్రములతో, కరాల= భయంకరముగ, విరావ = మిక్కిలి ధ్వనిచేయుచున్న, విశిఖంబులు — బాణములు, సన్నిభము = సమానము, నిబిడ = దట్టమైన.

విద్యాధరి—హాహా ఘటిత తటి చ్ఛటా పింగళంబై యంబరం బింతలో నిట్లయ్యె నేమి ?

విద్యాధర—ఇప్పు డే మోగదా యిది !

గీ. త్వష్టృ యంత్ర పరిభ్రమి భ్రమ దఖండ
చండ మార్తాండ మండలోద్దండ మైన
యంతకాంతక దుస్సహోదగ్ర విపుల
తీక్ష్ణ లాలాట వీక్షణోన్మేష మొక్కొ ? 3.

(యోజించి) ఆఁ! తెలిసినది ; చంద్రకేతు కుమార ప్రయుక్త మగు నాగ్నేయాస్త్రము. దానిదే యి మ్మహోజ్జ్వల జ్వాలా ప్రసారము. ఇప్పుడు—

గీ. జ్వలిత శబలిత చామర ధ్వజము లగుచుఁ
గొలఁగి పోయె విమాన మండలము లవిగో !
కేతనాంకుర చేలాంత కీల లహహ !
నిమిష కుంకుమ లేప విభ్రమముఁ దాల్చె. 4.

దారు ణాశని శకల పరిస్ఫుటన పటుతర స్ఫులింగ రూపుండై, యుద్ఘటాకీర్ణ లేలిహాన కీలా సంఘాత భీకరుండును, గగనంతుండు నగు వైశ్వానరుండు ప్రజ్వలించు

తటిత్ = మెఱుపు యొక్క, ఛటా = పఙ్క్తిచేతను, పింగళంబై = పసిమివర్ణముకలదియై, త్వష్టృ=త్వష్టప్రజాపతి యొక్క, యంత్ర = చక్రియంత్రము యొక్క, పరిభ్రమి=తిరుగుటచేత, భ్రమత్ =తిరుగుచున్న, అఖండ=విశేషమగు, చండ = తీక్ష్ణమగు, మార్తాండ = సూర్యుని యొక్క, మండల=గోళమువలె, ఉద్దండమైన= అతిశయమైన, అంతకాంతక = శివుని యొక్క, దుస్సహ = సహింపశక్యముగాని, ఉదగ్ర= అతిశయమయిన, విపుల=విశాలమయిన, తీక్ష్ణ = కరుకగు, లలాట=ఫాలమందుఁగల, వీక్షణ=దృష్టి యొక్క, ఉన్మేష మొక్కొ = తెరచుటయో- అనునట్లున్నది యాగ్నేయాస్త్రమని భావము.

జ్వలిత = మండుటచేత, శబలిత = పసుపుగాఁ జేయంబడిన, కేతనాంకుర = జండాకొనలయందుఁగల, చేలాంతకీలలు =గుడ్డలకొనలయందలి మంటలు, అశనిశకలము = పిడుగుముక్క, లేలిహానము = నాలుక, కీలాసంఘాతము = మంటల సముదాయము.

చుండె. వీని సంతాపము సర్వతోముఖంబై యుచ్చండమై యున్నయది. కానఁ జేరియసిని నెమ్మెనఁ గప్పి దవ్వగఁ దొలంగుదును. (అట్లు చేయుచున్నాఁడు)

విద్యాధరి—సంతోషము ! విమల మౌక్తిక ఘన తుషార మసృణ మాంసలం బగు ప్రియగాత్ర స్పర్శంబున నానంద మీలితోద్భ్రాంత నేత్ర నగు నాసంతాప మంతరిత మైనది.

విద్యాధర—సుందరీ ! నే నిం దే మొనర్చితిని ?

క. ఇంచుక యుఁ జేయకున్నను
దురించున్ సౌఖ్యములచేత దుఃఖము లెల్లం
బారించ ప్రియజన మనఁగా
నెంచఁగ రానట్టి ద్రవ్య మిల మనుజులకున్. 5.

విద్యాధరి—నిబిడ చంచలోద్భ్రాంత తటి ల్లతా విభ్రమాలంకృతంబులై, సమద నీలకంఠ కంఠ శ్యామలంబు లగు వలాహకంబులచే నంతరిక్ష మెల్ల వేల్లితం బయ్యె నేమి ?

విద్యాధర—సుందరీ ! ఇది లవకుమార ప్రయుక్త వారుణాస్త్ర ప్రభావము. ఏమి ? అవిరళ ప్రవృత్త వారి ధారా సహస్ర సంప్రసారములచే నాగ్నేయాస్త్రంబు జల్లారి నట్లున్నది.

విద్యాధరి—నాకు సంతోషముగా నున్నది.

విద్యాధర—అన్నన్నా ! అన్ని యెడల నతివృత్తి దోషాస్పదము. విపుల ఝంఝూనిల క్షోభ గంభీర గుణగుణాయమాన ఘనాఘనాకీర్ణాంధకార నీరంధ్ర నిబద్ధమై యుగప జ్జగ ద్గ్రసన వికీర్ణ భీషణ కాలకంఠ కంఠ కందరాస్థితంబునుం బోలెఁ, గల్పాంత యోగ నిద్రానిరుద్ధ సర్వద్వార నారాయణోదర ప్రవిష్ట మైనదియు నుం బోలె, భూతజాత మెల్ల నుద్విగ్న మగుచున్నది. మంచిది వత్సా ! చంద్రకేతూ ! మంచిది. యుక్తమే వాయవ్యాస్త్రముం బ్రయోగించితివి కావున—

గీ. తత్త్వ విజ్ఞానమున వివర్తంబు లెల్ల
బ్రహ్మయందును బోలె, బ్రభంజనమున

---

సర్వతోముఖము = అంతట వ్యాపించినది, మసృణ=నునుపయినట్టియు, మాంసల=బలిసినట్టియు, మీలితోద్భ్రాంత = మూసికొనుటచే భ్రాంతిఁ బొందిన. నీలకంఠ=నెమలి, వలాహకంబు = మేఘము, వేల్లితము = ఆవరింపఁబడినది. నీరంధ్రము = దట్టము, నిబద్ధమై = కూడినదై, యుగపత్ = ఒక్కమారుగా, గ్రసనము=మ్రింగుట. అవరుద్ధము = అడ్డగింపఁబడినది, ఉద్విగ్నము = చలించుట, వివర్తము = భ్రాంతికల్పిత మైన యాకారకల్పము.

నంబుధర సంఘ మెల్ల ననంత మయ్యె
వింతదోఁపఁగ నేఁడనో విలయ మొందె. 6.

విద్యాధరి—నాథా! సరభసోన్నమిత హస్త భ్రమిత చేలాంచలుండై, దూరంబు నుండియే మధుర వచనంబులచే సమరానురోధంబు నిరోధించుచు నిప్పుడీ కుమారకుల నడుమ విమానమ్ము నవతరింపఁ జేయుచుండె నీతఁ డెవ్వరో గదా?

విద్యాధర—(చూచి) ఇతఁడు శంబూక వధాగతుఁ డగు దేవుండు రఘుస్వామి.

గీ. అమ్మహాత్ముని వచనమ్ము నాలకించి
గౌరవమ్మున ఘోర సంగ్రామ మాపి
లవుఁడు శాంతించెఁ, జంద్రకేతువును మ్రొక్కెఁ,
బతికి సుతసంగమమున భవ్యమగుఁగాక! 7.

కాన నిటనుండి మరలి పోవుదము. (నిష్క్రమింతురు.)

విష్కంభము.

---

(పిదప రాముఁడు లవుఁడు ప్రణతుఁ డగు చంద్రకేతుఁడుఁ బ్రవేశింతురు.)

రామ—(పుష్పకమునుండి దిగుచు)

గీ. సవితృకుల వారినిధి చంద్ర! చంద్రకేతు!
గాఢపరిరంభ మిమ్ము వేగముగ రమ్ము
హిమశకల శీత భవదంగకములచేత
నాదు మానసతాప మణంగుఁ గాత! 8

(లేవ నెత్తి స్నేహ బాష్పములతోఁ గౌఁగిలించుకొని) దివ్యాస్త్రధర శరీరునకు నీకుం గుశలమా?

చంద్ర—అత్యద్భుత ప్రియమిత్రుండును, ప్రియదర్శనుండు నగు లవుని లాభాభ్యుదయంబు తోడం గుశలము. కాన విన్నవించెదను. మత్తుల్యముగఁ గాని, మచ్ఛిష్యముగఁ గాని యీ మహావీరాగ్రణిం జనకుండు కటాక్షించుఁగాక

---

* సవితృకులము—సూర్యవంశము.

చంద్రి—ప్రియవయస్య ! తాతపాదులుగదా !

లవు—నన్ను "ప్రియవస్యా" యని పిల్చితివి గాన ధర్మసరణిచే నాకును నట్లే; మ ఱియు మీకిట్టి సంజ్ఞాభాజనంబు లగు మాననీయులు రామాయణ కథా పూరు షులు నల్వురుగదా ! అందు వీరెవ్వరో తెల్పుము.

చంద్రి—జ్యేష్ఠ తాతిపాదు లని యెఱుంగుము.

లవు—(ఉల్లాసముతో) రఘుస్వామియా యేమి ? సంతోషము ! దేవర దర్శనం బున నేడు సుప్రభాతము. (వినయ కౌతుకములతోఁ బరికించి) తండ్రీ ! ప్రా చేతసాంతేవాసియగు లవుఁడు నమస్కరించుచున్నాఁడు.

రామ—ఆయుష్మంతుఁడా ! రమ్ము రమ్ము. (స్నేహముతోఁ గౌఁగిలించుకొని) ఓవత్సా ! వినయముతోఁ బని లేదు. పెక్కుసారులు బిగ్గ గౌఁగిలింపుము.

గీ. పరిణతాపూర్ణ పుష్కరాంతర పలాశ
మస్సృణ మాంసల తర సుకుమార మైన
నీ తనుస్పర్శ మానంద నిలయ మయ్యెఁ
జంద్రి చందన నిష్యంద సరసమగుచు. 13.

లవు—(తనలో) నాయెడల వీరి కిట్టి యకారణ స్నేహము. నేనన్నో తెలియక వీరికే యపచార మొనర్చితిని. ఆయుధ పరిగ్రహము వఱకుదుస్సాహమునఁబ్రవ ర్తించితిని. (ప్రకాశముగా) తాతపాదు లిపుడు లవుని యజ్ఞానమును సైరింతురు గాక !

రామ—వత్సా ! అపరాధమేమి ?

చంద్ర—అశ్వానుచరుల వలనఁ దాత బ్రతాప ప్రకటన మాలకించి యీతండు పరా క్రమించె.

రామ—ఓయీ ! క్షత్రియజాతి కిది యలంకారమే కదా !

చ. ఇతర పరాక్రమంబు సహియింపఁడు శూరుఁ డదే స్వభావమా
నతనికి ; నారయం బ్రకృతియందలి దాట నక్షత్రమంబు ; సం

---

తాతపాదులు = తండ్రిగారు, సుప్రభాతము = తెల్లవారిన వేళమంచిది. (good morning) పరిణతా = పండుటచే, అపూర్ణ = లెస్సగానిండిన పుష్కర = పద్మము లోని, అంతరపలాశ = లోనిరేకువలె, చంద్రి = కప్పురము యొక్కయు, చందన = మం చిగంధముయొక్కయు, నిష్యంద = ద్రవమువలె—సరసమగుచు.

తత కిరణంబులం దపన దైవత ముగ్రగతిం దపింప ధి
క్కృతమును బోలె భానుమణి యేగతిన్; తేజము గ్రక్కు నొక్కటన్. 14.

చంద్ర—ఆగ్రహంబు సైత మి వ్వీరునియందే శోభిల్లును. ప్రియ వయస్య ప్రయుక్త జృంభకాస్త్ర నిశ్చల స్తంభితంబు లగు సైన్యంబులం జనకుండు పరికించుఁగాక!

రామ—వత్స! లవా! అస్త్రంబు నుపసంహరింపుము. చంద్రకేతూ! నీవును బారవశ్య వ్యాకులితంబు లగు బలంబుల నూరడింపుము.

లవు—జనకుఁ డాజ్ఞాపించి నట్లే (ధ్యానమును నటించుచున్నాఁడు)

చంద్ర—ఆజ్ఞాప్రకారము. (నిష్క్రమించును)

లవు—అస్త్ర ముపసంహృతం బైనది.

రామ—వత్సా! రహస్యోపయుక్త ప్రయోగ సంహారంబు లగు నస్త్రంబులు శ్రౌత మంత్ర సమన్వితంబులు.

గీ. నలువ మున్నగు తొంటి పెద్దలు బుద్ధ
తంబు కొలఁకు సహస్రాధికంబు లబ్ద
ములు దపముఁ జేసి నిజ తపోమూర్త తేజ
ములుగ విలసిల్లు నా యస్త్రముల గనిరి. 15.

పిదప నీ మంత్రపారాయణోపనిషత్తును భగవంతుఁ డగు భృశాశ్వుండు సహస్రాధిక వత్సరాంతేవాసియుం గుశిక వంశ్యుండు నగు విశ్వామిత్రున కనుగ్రహించె. ఆభగవంతుఁడు నాకే ప్రసాదించె. ఇదే సంప్రదాయము. కుమారుని సంప్రదాయ మెద్దియో యడుగుచుంటిని.

లవు—మా యిర్వురి యస్త్రంబులు స్వయంప్రకాశములు.

రామ—(యోజించి) అసంభావ్య మేమి? ప్రకృష్ట సుకృత పరిపాక సంభవం బగు నెద్దియో మహిమయై యుండును. ద్వివచన మెట్లు?

లవు—సోదరుల మేము కవలము.

రామ—అట్లయిన ద్వితీయుఁ డెవ్వరు?

---

తపనదైవతము = సూర్యుఁడు, భానుమణి = సూర్యకాంతశిల, స్తంభితము = కట్టుబడుట, ఉపసంహృతము = ఉపసంహారము చేయఁబడినది.

(తెఱలో) " భాండాయన! భాండాయన "

చ. అవలఁ జిరాయువా లవనకా! నరపాలక సైనికాళితోఁ
బవరము ? మిత్రుఁడా ! యిప్పుడు పల్కిన దే మను ? నా నటందువా ?
భువనములం దధీశ్వర సముస్నత శబ్దము మాయుఁగాక ! నేఁ
నెవ్వర ! నగేంద్రశస్త్ర జాలావళి మించు శమించుఁ గావుతన్. 16

రామ—

ఉ. ఈతఁ డెవాఁడొ ? బంధుర మహేంద్రమణి స్ఫుట నీల దీప్తితో
నాతత కంఠనాదమున నంగమునం బులకల్ ఘటించి, నన్
నూతన మేచకాంబుద మనోహర గర్జిత నిస్వనోత్సవ
స్ఫీత నిబద్ధ కుట్మల విభిన్న కదంబము నా నొనర్చెడిన్. 17

లవు—ఇదిగో ! యితఁడు నా జ్యేష్ఠుఁ డగు నార్యుఁడు కుశుఁడు; భరతాశ్రమము నుండి మరలి వచ్చె.

రామ—వత్సా ! ఈ యాయుష్మంతు నిటు పిలువుము

లవు—అటుల నే (పరిక్రమించును)

కుశు—(అద్భుత హర్ష ధైర్యములతో ధనుస్సు నాస్ఫాలించుచు)

చ. హరి కభయం బొసంగి, మిహిరాత్మజుఁడౌ మను చంద్రుఁ డాదిను
ష్కర జనులం దహింపఁ దను క్షాత్ర మహానలమున్ గెరల్చు భా
స్కర కుల ధారుణీశ్వరుల సంగర మబ్బెన యేని, మ త్పరి
స్ఫురిత శిఖాస్త్ర దీప్త గుణ శోభిత చాపము ధన్యమౌ నిఁకన్. 18

(వికటముగాఁ బరిక్రమించు చున్నాఁడు.)

రామ—ఏమి ! యీ క్షత్రియ డింభకుని విక్రమాతిశయంబు !

---

మించు = అతిశయము, నిస్వన = ధ్వని గలిగిన, ఉత్సవ = సంతోషముతో, స్ఫీత = అధికముగా, నిబద్ధ = కూర్పఁబడిన, కుట్మల = మొగ్గలచే, విభిన్న = విరిసిన, కదంబము = కడిమిచెట్టు, మిహిరాత్మజుఁడౌ మను చంద్రుఁడు = వైవస్వతమనువు, పరిస్ఫురిత = ప్రకాశించుచున్న, శిఖాస్త్ర = శిఖలను బాణములచే, దీప్త = ప్రకాశింపఁ జేయఁబడుచున్న, గుణ = నారిచే, శోభిత = అలంకరింపఁబడిన, చాపము = విల్లు.

ఆ. అహహా! సుప్రసన్న మగు శుభాకారంబు
పరమ పావన ప్రభావ మహహా!
దివ్యపాత్ర మౌఁదె తివిరి రామాయణ
కవి స్వకీయ వాక్ప్రకటనఁ జేసె. 20.

(సమీపించి) జనకా! ప్రాచేతసాంతేవాసియగు కుశుఁడు నమస్కరించు చున్నాఁడు.

రామ—ఆయుష్మంతుఁడా! రమ్ము రమ్ము.

గీ. అమృత పరిపూర్ణ వారివాహంబుఁ బోలె
మసృణ బంధుర మైన నీ మంజు లాంగ
మును నిరంతర వాత్సల్య మనుగమింప
బిగియఁ గౌఁగిటఁ జేర్ప నే వేడ్కఁ గొనెద. 21.

(కౌఁగిలించి తనలో) ఈ డింభకుం డెవరి కుమారుఁడు?

శా. ప్రత్యంగ స్రుత మదీయ తను నిర్యత్స్నేహ సారాంశమో?
ప్రత్యక్షాకృతిమై బహిస్స్ఫురితమై భాసిల్లు చైతన్యమో?
అత్యానంద విజృంభణ క్షుభిత చిత్తాసార నిర్మాణమో?
సత్యం బీ పరిరంభ మంగము సుధా సారాపగన్ ముంచెడిన్. 22.

లవ—జనకా! మయూఖమాలి జాలసంతాపి యయ్యె. కాన నీ సర్జ తరు చ్ఛాయ యం దొక్కింత సేపు జనకుఁ డుపవేశించుఁగాక!

రామ—వత్సా! నీ యిచ్చవచ్చినట్లే. (అందఱుఁ బరిక్రమించి కూర్చుందురు)

---

వారివాహము = మేఘము, మసృణ = నునుపగు, అనుగమింప = చూపుటకు, ప్రత్యంగస్రుత = ప్రతి అవయవములనుండి జారిన, మదీయ = నాయొక్క తను = దేహమునుండి, నిర్యత్ = బయలువెడలిన, స్నేహ = తేజోధాతువుయొక్క, సారాంశమో = పరిణామవిశేషమో? అత్యానంద = సంతోషాతిశయముయొక్క, విజృంభణ = వికాసముచేత, క్షుభిత = కలఁచఁబడిన, చిత్త = హృదయముయొక్క, ఆసార = ప్రవాహము యొక్క, నిర్మాణమో = సృష్టియో, సుధాసారాపగన్ = అమృత సముద్రమునందు.

మయూఖమాలి = సూర్యుఁడు, జాలసంతాపి = లోకమును బరితపింపఁ జేయువాఁడు. సర్జతరుచ్ఛాయ = మద్దిచెట్టునీడ, ఉపవేశించుఁగాక = కూరుచుండును గాక.

రామ—(తనలో)

గీ. ఆహాహా ! వినయ ప్రవర్తనమందు సీత
యాసన స్థితి సంచరణాదులైన
కుశ లవుల భావములు నాకు గోచరించె
బహుళ సామ్రాజ్య లక్షణాస్పదము లగుచు. 23.

మఱియు—

చ. ప్రతిజన రంజనీయ రుచి భాసుర దేహము సత్ప్రయత్న సం
గత కమలా విలాసములు గాఢగతిన్ విలసిల్లఁ జేసె ; నం
చిత మగు సచ్ఛరత్నమును జిత్రమయూఖములో యనంగ, వి
స్తృత వికచారవిందమును దివ్యమరంద లవంబులో యనన్. 24.

వీరియందుఁ బరిపూర్ణ మగు రఘుకుల కుమార సాదృశ్యంబు గాన వచ్చుచుండె.

చ. తరుణ కపోత కంఠ తులితం బగు చామనచాయ మేను, భా
స్వర వృష భాంసముల్, సమ విభాసిత గాత్రములుం, బ్రసన్న
సరి నిభ నిశ్చలేక్షణ విసారము, మంగళ మర్దళ ప్రతి
స్ఫురణ మనోజ్ఞ ధీర రవముం బరికింప ముదంబుఁగూర్చెడిన్. 25.

(సూక్ష్మముగా నిరూపించి) ఓహో ! వీరి యాకారము మమ్ములనే పోలి యుండలేదు..

చ. అమరఁగ నీ శిశుద్వయమునందు ధరాతన యానురూప రూ
పమును బ్రవీణ దృష్టి నెఱపన్ విశదంబుగఁ దోఁచు చుండె, సం
భ్రమమున నూతనాంబుజ రమా విలస ద్దయితా ముఖంబు నే
త్రములకు నేటికి న్మరల దర్శన మిచ్చిన భంగిఁ దోఁచెడిన్. 26.

ఆసనము = కూర్చుండుట, స్థితి = ఉనికి, సంచరణము = ప్రవర్తనము, మయూఖము = కిరణము, విస్తృత = విశాలమైన, వికచారవిందము = వికసించిన పద్మము, మరందలవము = పూఁదేనె, కపోతము = పావురము, తులితము = సమానము, కేసరి = సింహముతో, నిభ = సమానమయిన, విసారము = వ్యాప్తి, మర్దళము = మద్దెలము, ప్రతిస్ఫురణ = జ్ఞప్తికిఁదెచ్చుచున్న, ధరాతనయ = సీతతో, అనురూప = పోల్పఁదగిన, రమా = శోభచేత, విలసత్ = ప్రకాశించు, దయితా = భార్యయగు సీతయొక్క.

గీ. మౌక్తిక స్వచ్ఛ దంత రుచ్యమధుర మైన
యధరమును గర్ణపాశంబు నవియె కావె ?
నయనములు రక్త నీల వర్ణంబు లైన
నమల సౌభాగ్యసద్గుణం బదియు కాదె ? 27

ఇది ప్రాచేతసావాస మగు కాంతారము ; ఇచటనె దేవి పరిత్యజింపఁబడి యె. ఈ కుమారుల యాకార మిది. అస్త్రములు స్వతఃప్రకాశము లనుటలో విమర్శింప వలసియున్నది. ఆ చిత్ర సందర్శన కాలమున నస్త్రాభ్యనుజ్ఞాన మిచ్చినట్లుగాలేదు గదా ! పురాతనుల కయినను సంప్రదాయ విరహితంబు లగు నస్త్రముల వినియుండలేదు. నా యీ హృదయానందాతిశయము చంచలం బగు నంతరాత్మను విశ్వసింపఁజేయుచున్నది. మఱియు దేవి గర్భభారము నాచే ద్విధా గృహీత మయ్యె. (కన్నీళ్ళతో)

మ. మును జన్మించిన ప్రేమ మించు ప్రణయోత్కర్షంబుచే హృచ్ఛమం
తనమందు న్నొరనమ్మియు, న్సహజ మందాక్షాతిమందాక్షియౌ
వనిత న్నేఁ గలఁ కేలితో నిమిరి గర్భద్వైతముం గొల్తు నేఁ
గనుఁగొంటిన్, మఱి కొన్ని నాళ్ళ కెటులోగం గంజాక్షియుం బిమ్మటన్. 28.

(ఏడ్చి) ఏదేని యుపాయమున వీరి నడుగుదునా ?

లవు—జనకా ! యేమిది ?

క. భువనత్రయ మంగళ మగు
భవదీయాస్యంబు బాష్పవర్షము చేతన్
నవ నీహార నిషిక్త
ప్రవిమల రాజీవ సుభగ భావముఁ దాల్చెన్. 29.

కుశు—ఓవత్సా !

ఉ. ఏయది వంతగాను మనువేంద్రునకున్ నిజ పేమఁ బాసినం ?
బ్రేయసి లేకయున్న వనమేకద ! సర్వజగంబు ; న్నేహము
ట్లాయతమైన, దీ విగహ మన్న ననంతము; చూడఁ జూడ రా
మాయణ గాథ ని వెఱుఁగనట్లుగ నిట్లనుగాగ నేటికిన్. 30.

రుక్=కాంతి, ద్విధాగృహీతము=రెండుగా గ్రహింపఁబడినది, మందాక్ష=లజ్జచే, అతిమంద=మిక్కిలిజడమగు, అక్షి=చూపులుగలది, కలన్=విద్యచే, గర్భద్వైతమున్=పిల్లలిద్దఱుగల గర్భముగా నుండుటను, ఆస్యము=ముఖము, నవ=నూతనమైన, నీహార=మంచుచేత, నిషిక్త=తడుపఁబడిన, ప్రవిమల=స్వచ్ఛమయిన, రాజీవ=పద్మమువంటి, సుభగ=సౌందర్యముచేనుత్కృ, భావమున్=తాల్చెన్.

రామ—(తనలో) అన్నా ! వీరి సంభాషణము తటస్థముగా నున్నది; ప్రశ్న వేల; దగ్ధహృదయమా ! ఆకస్మికం బగు నీ చాంచల వికార మేటికి ? ఇట్లు వ్యక్తీభూత మానసోద్వేగుండనయి శిశుజనంబుచే దయఁ జూడఁ బడితి. ఔఁగాక ! కప్పిపుచ్చెదను. (ప్రకాశముగా) వత్సలారా ! వాల్మీకి భగవానుని వాణీవిలాసంబును, భాస్కరాన్వయ ప్రాశస్త్యంబు నగు రామాయణంబు విన వచ్చెడి. అం దొకించుక వేడుకతో వినఁ గోరెదను.

కుశ—ఆ సందర్భ మెల్ల మాచేఁ బఠింపఁబడియె. బాలచరిత్రాంత మాధ్యాయమున నీ రెండు శ్లోకములు మాకిపుడు స్మృతియం దున్నవి.

రామ—వత్సా ! పఠింపుము.

కుశ—

*శ్లో॥ "ప్రియాతు సీతా రామస్య దారాః పితృకృతా ఇతి
గుణాద్రూపగుణాచ్చాపి ప్రీతిర్భూయో౽భ్యవర్ధత
తథైవ రామ స్సీతాయాః ప్రాణేభ్యో౽పి ప్రియో౽భవత్
హృదయం త్వేవ జానాతి ప్రీతియోగం పరస్పరం॥

రామ—(తనలో) కష్టము ! హృదయ మర్మోద్ఘాత మతి దారుణంబయినది. హా ! దేవి ! అప్పుడిట్లయ్యె నఁట ! ఓహో ! సంసార వృత్తాంతములు నిరనుబంధ వ్యత్యాస నిరానంద భావంబులై విప్రలంభముగాఁ బరిణమించి పరితపింపఁ జేయుచున్నవి.

ఉ. ఎయ్యెడ మించు నమ్మికల నెంత గనించెడి నట్టి సమ్మదం ?
బెయ్యెడఁ గూఢకౌతుకము ? నేఁడఁ బరస్పర యత్నసంనయం ?
బెయ్యెడ నిష్టకష్టముల నేకగతిం గను మానసైక్య ? మ
ట్లయ్యెను బాప రూప మగు సారము నణంగక ప్రజ్వలించెడిన్. 31.

ఓహో! కష్టము !

---

* గీ. రామునకు సీత దశరథోడ్రిక్తదార
యగుచు గుణరూపములఁ బ్రేమనలరె; నట్లె
సీతకును రఘురాముండు ప్రీతిఁ గూర్చె ;
వారి హృదయానురాగంబు వారి కెఱుక.

క. వీకం బేర్చియసి గుణగణ
మేకంబుగ నుల్లసిల్ల నెంతయు నిగరా
నేకాలము దుస్స్మర మగు
నా కాలం బే స్మరింప నయ్యెన్ మాకున్. 32.

వ. తొలుతవయోనురాగములతో ఘనతం గను మారుఁ డుల్లమా
దలర విదగ్ధ వర్తనము నందియుఁ నెమ్మెయి ముగ్ధుఁ డయ్యె; న
య్యలఁతి వయస్సునందు హరిణాక్షి చనుంగవ యించుకంతరై
మొలచి యొకింత పెంపుఁ గనె మోదమునన్ మఱి కొన్నినాళ్లకున్. 33

కుశ—మందాకినీ చిత్రకూటాంతర కాంతార విహారంబున జానకీదేవింగూర్చి రఘు నాథుని శ్లోకము.—

* శ్లో॥ త్వదర్థ మివ విన్యస్త శ్శిలాపట్టోయ మగ్రతః
యస్యాయ మభితః పుష్పైః ప్రవృష్టఇవ కేసరః॥

రామ—(తనలో లజ్జా స్మిత స్నేహ కరుణములతో) అగ్భకులు మిగుల ముగ్ధులు; అందును వన సంచారులు; హా! దేవి! నాటి విస్రంభాతి ప్రసంగ సాక్షి యగు నా ప్రదేశమును స్మరించు చుంటివా? కష్టమోహో కష్టము!!!

మ. తరళ స్వేద హిమంబు, మంద విచల న్మందాకినీ మారుతో
త్కర లోలాలక కీలితాళిక శశాంకద్యోతముం, గుంకుమ

---

* క. నలుదెసలను వకుళము పూ
వులఁ దావర్షించునటులఁ బొలుచు నల శిలా
ఫలకము నీకై యిదె! ముం
గల విన్యస్తంబుగాఁ గనందగె నబలా!

తరళ=దట్టమైన, స్వేద = చెమటచేత, హిమంబు = చల్లనయినదియుం, మంద = నెమ్మదిగా, విచలత్ = కదలుచున్న, మందాకినీ = గంగానది నుండివీచు, మారుత = వాయువుచే, ఉత్కర = ఎగరఁగొట్టుటచే, లోల = చలించుచున్న, అలక = ముంగురులచేతను, కీలిత = కూర్పఁబడిన, అళిక = ఫాలభాగమను, శశాంకద్యోతమున్ = చంద్రకాంతిగలదియు, కుంకుమ = కుంకుమయొక్క.

స్ఫురణానంకిత దీప్త గండమును, నిర్వ్యాపాభిరామ శ్రవః
పరిముగ్ధంబును, నా భవన్ముఖము మద్ధ్యానంబున నెంచెదన్. 34.

(నిశ్చేష్టుఁడై నిల్చి దైన్యముతో) హాహాహా !!!

చ. తపనుఁగ నెంచి యెంచి యెడఁదన్ మును సృష్టి గ్రుచ్చి నిల్పఁగాఁ
బడు ప్రియ బంధు వర్గము ప్రవాసమునందును నారడించు ; న
ట్లపరు ప్రియాప్తహాని జగమంతయు శీర్ణవనత్వ మొందు ; లో
పడికెడి భంగిఁ దొట్రిపడు నుల్లము తీవ్ర తుషానలంబునన్. 35

(తెఱలో)

మ. "అల వాల్మీకి విదేహవల్లభ వసిష్ఠారుంధతీయుక్త కౌ
సలజాతాదులు తాము బాల సమరోచ్చప్రశ్రుతిం త్రస్తులై
యలఁతన్, వార్ధక విశ్లథాంగముల, దవ్వై యాశ్రమం బుంట, ను
చ్చలితావేగ మనస్కులై తపనునం జన్ దెంచుచున్నా రిటుల్." 36.

రామ—ఏమి ? భగవంతులగు నరుంధతీ వసిష్ఠులు, జననులు, జనకుడుం గూడ నిచ్చటికేనా ? వీరి నెట్లు చూడఁగలను ? (దైన్యముతోఁ జూచి) అహహా ! తండ్రియగు జనకుండుఁ గూడ నిచ్చటికి వచ్చుటం జేసి నిర్ఘాత నిహతుండనైతి. మందభాగ్యుఁడను.

చ. అనఘుఁ డనంగ వ్రతుఁడునైన వసిష్ఠ మునీంద్రు లుండఁగం
దనయ వివాహ మంగళమునం దగు తండ్రిలఁ గాంచి, యీగతిం
బెను గడగండ్ల నిట్టి పితృమిత్రుని జూచిన వేయి వ్రక్కలై
తునుఁగదె ?—కాని రామునకు దుష్కర మెద్ది ? మదిం దలంచినన్. 37.

(తెఱలో) కష్టము కష్టము !

---

స్ఫురణ=స్ఫురణచేత, అనంకిత=చిహ్నములేకయే, దీప్త=ప్రకాశమానమైన, గండమును=చెక్కిళ్ళుగలదియు, నిర్వ్యాప=అలంకారములు లేకయే, అభిరామ=మనోహరమైన, శ్రోత్రః=చెవులతో, పరిముగ్ధంబును=మిగుల నందమైనదియు, అగు నీ ముఖమును—నా భావంబున నెంచెదను. పరివాసము=పరస్థలవాసము, తుషానలంబు=ఊకకుమ్మ, సమర=యుద్ధముయొక్క, ఉచ్చ=అతిశయమయిన, ప్రశ్రుతిన్=వినికిడలన, త్రస్తులై=భయపడినవారై, విశ్లథాంగములు=శిథిలములైన యవయవములు, నిర్ఘాత నిహతుఁడ=పిడుగు దాఁకినవాఁడ.

చ. వల దనుభావ మాత్ర సముపస్థిత దివ్య రమాంకుఁ డౌచు గో
నలువున నున్నయట్టి రఘునాథుని గొబ్బునఁ గాంచినంతఁ దో
ర్లొలుతఁ బ్రబుద్ధుఁడౌ జనకభూర్గ్వహుఁ డెప్పు డెఱుంగఁ బల్కె, వి
హ్వలిత మనస్కులై జనను లక్కట! మూర్ఛిలు చుండి రొక్కటన్. 38.

రామ—హా! తండ్రీ! జనకా! —హా! తల్లులారా!

క. జనక రఘువంశ సంభవ
మనుజేంద్రుల యఖిలగోత్ర మంగళ మగు పా
వని యెడఁ గృప లేని ఖలుం
డను నాపై మీకుఁ గరుణ నాటిన వృథయా. 39.

ఓదార్చెదను. (లేచును.)

కుశ—లవ—ఇట్టిటు,

(దైన్య వ్యాకులత్వములతోఁ బరిక్రమించి అంగము విశ్రమింతురు.)

కుమార ప్రత్యభిజ్ఞాన మను

షష్ఠాంకము.

సంపూర్ణము.





---

వలత్=ప్రకాశించుచున్న, అనుభావమాత్ర=ప్రభావమునమాత్రమే, సముపస్థిత=నిలిచియున్న, దివ్య=దేవతాసంబంధమగు, రమా=శోభయే, అంకుఁడు=చిహ్నముగాఁగలవాఁడు, ప్రబుద్ధుఁడు=తెలిసికొనినవాఁడు, ఒక్కటన్=ఒక్కమారు.



# ఆంధ్రీకృతోత్తర రామచరిత్రము.

## సప్తమాంకము.

---

లక్ష్మ—(ప్రవేశించి) ఓహో! యిప్పుడు వాల్మీకిభగవానులు బ్రహ్మక్షత్రియ శైవపౌర జానపదుల మాతోడం బిలిచి సకల దేవాసుర నర తిర్యగురగ జంగమ స్థావర సంఘమును స్వప్రభావముచే సమకూర్చె; మఱియు నార్యుండు "వత్సా! వాల్మీకి భగవానులు, స్వప్రణీతమై యప్సరఃప్రయుక్తం బగు ప్రబంధంబుం జూడ మన కానతిచ్చె. కాన భాగీరథీతీర రమణీయ సీమ కరిగి సభా సన్నివేశ మేర్పఱచు" మని నియోగించె. మర్త్యామర్త్య భూతసంఘాతమున కుచిత స్థానముల నర్హాసనముల నొసంగుచు వచ్చితిని. ఇదిగో!

గీ. మహిత రాజ్యాశ్రమంబున మసలు చుండి,
దుపకరించు మునివ్రతంబునఁ బూనియైన
గమణ వాల్మీకి మౌని గౌరవము వలన
నరుగుదెంచుచు నున్నాఁడి యార్యుఁ డిటుల. 1.

రామ—(ప్రవేశించి) వత్సా! లక్ష్మణా! యుపవేశించిరా రంగదర్శకులు?

లక్ష్మ—చిత్తము.

రామ—వాత్సల్యగు నీ కుశలవులు చంద్రకేతు తుల్యమగు స్థానగౌరవము నొంద నర్హులు.

లక్ష్మ—పరిభువస్నేహ విస్రంభమున నట్లే యొనరింపఁబడియె. ఇదే! రాజాసనంబు నేర్పఱచితి; ఆర్యుం డుపవేశించుఁగాక!

---

ఉపవేశించిరా = కూర్చుండిరా!

రామ—(కూరుచుండును.)

లక్ష్మ—ఓయీ! ప్రారంభింపుము.

సూత్రి—(ప్రవేశించి) భగవంతుఁడును భూతార్థవాదియును నగు ప్రాచేతసుండు చరాచర జగంబున కిట్లాజ్ఞాపించుచున్నాడు. "ఆర్ష దృష్టిచేఁ బరిశీలించి పావనంబును గరుణాద్భుత రసంబు నగు నెద్దియో నిర్మింపఁబడియె. దానియెడలఁ గార్యగౌరవంబున జాగరూకులు గండు" అని.

రామ—"మహర్షులు ప్రత్యక్షీకృత సర్వధర్ములు. అమృత సారంబులై రజోగుణాతీతంబులగు వారి ప్రజ్ఞానంబు లెందును నవ్యాహతంబు లగుట సంశయాస్పదములు గావు" అని పలికినట్లయినది.

(తెరలోన)

"హా! ఆర్యపుత్రా! హా! కుమారలక్ష్మణ! మహారణ్యమున దిక్కులేక యేకాకినినైన మందభాగ్యురాలఁ బ్రసవ వేదనాక్రాంత నగు నన్ను హతాశంబు లగు శార్దూలంబు లపేక్షించుచున్నవి. నిర్భాగ్యురాల నాశరీరంబు నిప్పుడీ భాగీరథీ కేవి కర్పించుచుంటి."

లక్ష్మ—(తనలో) అన్నా! కష్టము! ఎద్దియో వే రయ్యెనే?

సూత్రి—గీ. దేవి సర్వంసహాపుత్రి దేవుఁడయిన
ప్రభునిచే దీర్ఘ వన పరిత్యక్త యగుచుఁ
బ్రసవవేదనఁ గను శరీరమును వదల
నపుడు భాగీరథీ దేవియందుఁ దొరఁగె. 2.

(నిష్క్రమించెను.)

రామ—హా! దేవి! హా! దేవి! లక్ష్మణా! చూడుము.

లక్ష్మ—ఆర్యా! నాటక మిది.

రామ—హా! దేవి! దండకారణ్య వాస ప్రియసఖి! ఏకరాముని వలనఁ గలుగు దురదృష్ట పరిపాక మిది.

హతాశంబులు = గుప్తములు, సర్వంసహాపుత్రి = భూపుత్రి.

లక్ష్మ—ఆర్యా! ప్రబంధార్థము గనుగొనుము.

రామ—ఇదిగో! వజ్రమయుండనై సిద్ధపడితిని.

(ఒక్కొక్క డింభకు నాకమునెత్తి నిడికొనిన ధరణీభాగీరథులచే నవలంబింపఁబడి సీత ప్రవేశించును)

రామ—వత్స! లక్ష్మణ! అకారణమై యవిజ్ఞాత మగు నంధకారముఁ బ్రవేశించు నట్లుంటి నన్నాదుకొనుము.

ధర—భాగీ—

గీ. జనకనందని! కల్యాణి! సంతసంబు
ఊరడిలు మింక వర్ధిలుచుంటి వమ్మ!
రఘుకులాధారు లగు కుమారకుల నింపు
గడలుకొన మన్న్యజలమునఁ గంటివమ్మ! 3.

సీత—(ఊరడిల్లి) సంతోషము! డింభకులఁగంటిని. హా! ఆర్యపుత్త్ర! (మూర్ఛిల్లును)

లక్ష్మ—(పాదముల నొరఁగి) ఆర్యా! సంతోషము! వర్ధిల్లుచుంటిమి. రఘువంశంబు మంగళాంకురమైనది. (చూచి) హా! హా! యేమి? దుర్నివార బాష్పపరీధ పర వశుండై యార్యుండు మూర్ఛిల్లెనే! (విసరుచున్నాఁడు)

ధర—ఊరడిల్లు మూరడిల్లుము.

సీత—(ఊరడిల్లి) భగవతీ! నీ వేయమ్మ! ఈమె యెవ్వరితె?

ధర—ఈమె నీ శ్వశురకుల దైవతము భాగీరథి.

సీత—భగవతీ! నీకు వందనము.

భాగీ—సౌశీల్య వర్ధితం బగు కల్యాణ సంపదం గాంచుము.

లక్ష్మ—అనుగ్రహింపఁ బడితిమి.

భాగీ—ఈమె నీతల్లి విశ్వంభర.

సీత—హా! తల్లీ! యిట్టి నేను నీచే వీక్షింపఁబడితిని.

ధర—రమ్మువత్సా! రమ్మపుత్త్రీ! (సీతను గౌఁగిలించుకొని మూర్ఛిల్లును)

లక్ష్మ—(సంతోషముతో) ఆనందము! ఆర్యారాలుధరణీ భాగీరథులచే ననుగ్రహింపఁ బడిరి.

రామ—(చూచి) ఇది యతి దీనముగా నున్నది.

భాగీ—సర్వంసహా యత్యున్ను దుఃఖించు చున్న దని సంతాన వాత్సల్యము జయించి నది. లేదా? ప్రాణులకు సర్వసాధారణమై యంతరంగమునం గల్గు నీ మోహ

గ్రంధి యెడ తెగని సంసార బంధము. వత్సా! జానకీ! భూతధ్ధాత్రి! ఊరడిల్లు మూరడిల్లుము.

ధర—సీతను గాంచి యెట్లూరడిల్లఁ గలను?

గీ. తడవు రాక్షస మధ్య వర్తన మొకండు,
కడకు దుస్సహ మైన త్యాగంబు రెండు;
భాగీ— తివిరి ఘటియింప నగుదురదృష్టమునకు
ద్వారములు మాయ దక్షుఁ డెవ్వండు ధరణి. 4.

ధర—భాగీరథి! తెస్సగాఁ బల్కితివి. ఇది తగునా రామభద్రునకు?

గీ. శైశవ గృహీత మైన హస్తమును, నేను,
జనకుఁడును, వహ్ని, నిత్యానుసరణ మహిమ,
సంతతియుఁ గూడ, నిప్పు డా శాబకునకు
నప్రమాణంబులుగ నెంచ నైతి మమ్మ! 5.

సీత—హా! ఆర్యపుత్త్రుని స్మరింపఁ జేయఁ బడితి.

ధర—అఁ! నీ కార్యపుత్త్రుఁ డెవ్వఁడు?

సీత—(లజ్జాబాష్పములతో) జనని పల్కినట్లే.

రామ—జననీ! ధరణీ! యిట్టివాఁడ నే.

భాగీ—అనుగ్రహింపుము భగవతీ! వసుంధరా! ప్రపంచమునకు దేహమవు. కానఁ దెలియనిదానివలె నల్లునియం దాగ్రహింతు వేమి?

మ. కలయం బ్రాక నకీర్తి లోకమున, లంకాద్వీపమందా మహా
నలశుద్ధిం జనుఁ డిందు నమ్మ నెటులన్? సర్వప్రజారాధనం
బల యిక్ష్వాకు నృపాళికిం గులధనంబౌ, దుర్ఘటం బల్లదే
తలపోయన్; మఱి వాని కెయ్యదియు కర్తవ్యంబు భాషింపుమా! 6.

లక్ష్మ—అమరులు భూతములయెడల నిరాఘాతాంతరజ్యోతులు. అందును జాహ్నవీదేవి యుత్తమురాలు; కాన నిదే నీకు నమస్కారాంజలి.

రామ—తల్లీ! నీవు భగీరథ కులానుగ్రహంబు ననువర్తించితివి.

ధర—మిమ్ము నిరంతరంబు ననుగ్రహించు చుంటిని. కాని సంతతికయిన శోకావేగ మాపాత దుస్సహంబు రామభద్రునకు జానకియందలి గాఢానురాగ మెఱుంగని దానఁ గాను—

గీ. దైవవశమున నతఁడు వత్స నెడబాసి
మనము శోకానలంబునే మరగుచుండి

నీకట ! లోకోత్తరంపు ధైర్యంబు వలనఁ
బ్రజల పుణ్యంబు వలనను బ్రదుకుచుండె. 7.

రామ—గురువులు సంతానప్రియులాదు దయామయులుగదా !

సీత—(ఏడ్చుచు నంజలి యొగ్గి) తల్లీ ! నీయందు నాకు విలయం బొసంగుము.

రామ—వే కేమి పల్కెను ?

భాగీ—శాంతము; వేయి వత్సరంబులు జీవించియుందువుగాక !

ధర—వత్సా ! యిప్పుడు నీ కుమారుల వీక్షింపుము.

సీత—అనాథురాల నయితి వీరితో నేమిఫలము ?

రామ—హృదయమా ! వజ్రమవైతివి.

భాగీ—సనాథురాలవయ్యు ననాథురాల వెట్లగుదువు ?

సీత—మందభాగ్యనగు నా సనాథత్వ మెట్టిది ?

ధర—భాగీ—

గీ. సకల జగదేక మాంగళ్యస్థాన మైన
యాత్మ ననపుతి నేయ భావ్యంబె నీకు ?
ఏదు సాంగత్యవశమున నేముఁ గూడఁ
బరమ పావన భావంబుఁ బడసినాము.

లక్ష్మ—ఆర్యా ! వినుము.

రామ—వినుగాక లోకము !

(తెఱలోఁ గలకలము)

రామ—ఎద్దియో మహాశ్చర్యము !

సీత—అంతరిక్ష మెల్లం బ్రజ్వలించుచుండె నేమి ?

ధర—భాగీ—తెలిసినది.

గీ. అల భృశాశ్వుండుఁ గౌశికుం డవల రాముఁ
డన గురుక్రమ మలరు నే యస్త్రములకు
నవియె ! జృంభకములతోడ నబ్బురంబు
నెలయఁ బటు దీప్తితోడ నావిర్భవించె.

(తెఱలో)

క. ఓదేవి ! జానకీ ! యభి
నాదన మిదె నీకు; రాఘవప్రభుఁ డా

ఖ్యాదర్శనమునఁ బల్కిన
మాదిరి, భవదీయ సుతులు మాకుం గతియౌ ! 10.

సీత—సంతోషము ! అస్త్ర దేవతలు ప్రజ్వలించుచున్నవి.

లక్ష్మ—"ఇయ్యవి సర్వవిధంబుల నీసంతతి నొందఁ గల" వనియార్యుండు వక్కాణించె.

గంగ— గీ. ఘనతరాస్త్రంబులార ! వందనము మీకు
ధన్యులము మేము యుష్మ దాదాన మహిమ
సద్భకులు మిమ్ము ధ్యానించినంతమాత్ర
దరికి వరుదెందు మీకు భద్ర మగుఁగాక ! 11.

రామ— గీ. అధికతర విస్మయానంద శిథిలితంబు
లగుచు క్షోభించు కరుణోర్మ లలవరించి
యిప్పుడు నా మది వచియింప నిరవుగాని
ఘనతరావస్థ నొకదానిఁ గలుగఁజేసె. 12.

ధర—భాగీ- ఆనందింపుము వత్సా ! నీ కుమారు లిపుడు రామభద్రతుల్యులై విలసిల్లుచుండిరి.

సీత—భగవతులారా ! వీరికి క్షత్రియకులోచితం బగు కృత్యంబు లెవరు నిర్వర్తింతురు ?

రామ— గీ. మానిత వసిష్ఠ రక్షితు లైన యట్టి
రఘునృపాలుర వంశవర్ధని యనంగ
నలరు జానకి కూడ నిజాత్మజులకు
వలయు సంస్కర్తఁ దెలియక వగచె నకట ! 13.

భాగీ—పుత్త్రీ ! నీ కీ చింత యేల ? యీ బాలకుల స్తన్యత్యాగానంతరమున వాల్మీకి భగవానున కర్పింపఁగలను. అతఁడే వీరికి క్షత్త్రియోచిత కృత్యంబు నిర్వర్తింపఁ గలఁడు.

క. ఎటుల వసిష్ఠాంగిరసులొ
యటులనె ప్రాచేతసుఁడు నల జనకరఘూ
ద్భటుల కులంబులు రెంటికిఁ
బటుతర దేశికుఁ డనంగ నలరును గాదే ? 14.

రామ—భగవతి లెస్సగా యోజించినది,

లక్ష్మ—ఆర్యా ! నీకిట్టుగ విన్నవించుచుంటిని. ఆయా యభిజ్ఞానములచే నీ వత్సలం గుశలవులఁగా నూహించుచుంటిని.

క. వీ రిరువురుఁ జూడ మహా
వీరులు, జన్మప్రసిద్ధ విపులాస్త్రులు, సం
స్కారము వాల్మీకియె దై
వారన్ వచియించె వయసు పన్డెండేండ్లే. 15.

రామ—వత్సలని యే నేనును జపల చిత్తుండనై యిప్పుడు ముగ్ధుండ నైతి.

ధర—రమ్ము వత్సా ! రసాతలమ్ము పావనంబు గావింపుము.

రామ—హా ! ప్రేయసీ ! లోకాంతరము నొందితివా ?

సీత—తల్లీ ! నీయవయవంబుల నాకు విలయం బొసంగుము. ఇట్టి సాంసారిక వ్యత్యయంబు ననుభవింపఁ జాల.

రామ—ఉత్తర మేమి వచ్చునో ?

ధర—వత్సా ! నా యాజ్ఞ వలన స్తన్యత్యాగము వఱకుఁ బుత్త్రుల నీక్షించుచుండుము. పిదప నీ యిచ్ఛ వచ్చిన ట్లొనర్పఁ గలవు.

భాగీ—అట్లే. (భాగీరథి, ధరణి, సీత నిష్క్రమింతురు.)

రామ—ఏమి వైదేహికి విలయమే సంభవించెనా ! హా ! దేవి ! దండకారణ్యవాస ప్రియసఖి ! హా ! చారిత్రదేవతా ! లోకాంతరము నొందితివా ?

(మూర్ఛిల్లును)

లక్ష్మ—మహాత్మా ! ప్రాచేతసా ! రక్షింపు రక్షింపు. నీ కావ్యార్థ మిదియేనా ?

(తెఱలో)

“ వాదిత్రఘోష ముపశమించును గాక . ఓహో ! చరాచర మర్త్యామర్త్య భూత జాతంబులారా ! వాల్మీకి భగవానునిచే ననుజ్ఞాతం బగు పావనంబు నాశ్చర్యంబునుం గనుంగొనుఁడు. ”

లక్ష్మ—(చూచి)

గీ. గాంగ జల మెల్ల ఘూర్ణిల్లెఁ గలఁచినట్లు
గగన తల మెల్ల సురముని స్థగిత మయ్యె
వహ్వారే ! యార్య జలముల వెలువెడలె
నవని భాగీరథీదేవు లనుసరింప.

(మరలఁ తెఱలో)

క. "భగణీసురనదులకు ద
గ్గఱ జేరు మరుంధతీ! జగత్త్రియ వంద్యా!
పరమ పతివ్రత సీతా
తరుణి వధూమణిని నీదు దరిజేర్చితిమా!" 17.

లక్ష్మ—ఆశ్చర్య మాశ్చర్యము! ఆర్యా! చూడుము చూడుము. (చూచి) అన్నా! ఆర్యుఁ డిప్పటికి నూరడిల్లలేదు.

(అరుంధతి, సీత, ప్రవేశింతురు)

అరుం—గీ. వత్స! వైదేహి! తత్తరపడు మధీర
భావముఁ దొరఁగు మతిహిత స్పర్శ మైన
నీదు కరపల్లవమున మన్నించి నాదు
పుత్త్రకుని జీవితమ్ము నిల్పు మిటు రమ్ము. 18

సీత—(తొందరతోఁ జేరి రాముని స్పృశించుచు) ఆర్యపుత్త్రుఁ డూరడిల్లుఁగాక!

రామ—(తేరఁడిల్లి యానందముతో) ఓహో! యేమిది? (చూచి హర్షాద్భుతములతో) ఏమి? దేవియు, నరుంధతియు, పము ల్లసిత ఋశ్యశృంగ కాంతా సమేతు లగు గురువు లందఱునా?

అరుం—వత్సా! ఇదే! భగవతియు, భగీరథ కులదేవతయు, సుప్రసన్నయు నగు మందాకినీదేవి.

భాగీ—(తెఱలో) "జగద్విభూ! రామభద్రా!" జననీ అట్టి నీవు కోడ లగు జానకియం దరుంధతియుంబోలె మంగళాశాసనంబుఁ గావించు చుండు" మని చిత్ర సందర్శనంబున నన్నుగూర్చిన నీవచనంబు స్మృతికిఁ దెచ్చుకొనుము. అందు ఋణవిము క్తురాల నైతి.

రామ—నేను మహాపరాధమును జేసినను భగవతిచే ననుగ్రహింపఁ బడితిని.

(ప్రణమిల్లును)

అరుం—ఇదే! నీ శ్వశురు వగు భగవతి విశ్వంభర.

భగ—(తెఱలో) "భగవతీ! విశ్వంభరా! పవిత్ర పుత్త్రిక వైన జానకి నరక్షించు చుండు" మని పుత్త్రీ పరిత్యాగకాలమున నాయుష్మంతుఁడు వాక్రుచ్చె కాన నిపుడు విభుం డగు వత్స మొకి— వాక్యంబు నిర్వర్తించితిని.

రామ—ఏమి? మహాపగాధ మొనర్చియు భగవతిచే ననుగ్రహింపఁబడితినా?

(నమస్కరించును)

అరుం—ఓహో ! పౌర జానపదులారా ! ఇదే ఇపుడు భగవతు లగు ధరణీ భాగీరథులచే మెచ్చఁబడి యరుంధతి నగు నాకు సమర్పింపఁబడి, మున్ను భగవాతుఁడగు వీతిహోత్రునిచేఁ బుణ్య చారిత్రగా నిర్ణయింపఁబడి, బ్రహ్మాది బృందారకులచే నభినందింపఁబడిన భాస్కరాన్వయా పహారత్న మగుయజ్ఞభూనందని సీతం బరిగ్రహించుటలో మీ యనుమత మేమి ?

లక్ష్మ—ఇట్లార్య యగు నరుంధతిచే సంతర్జితం బగు ప్రజామండలంబును సకల భూత సంఘాతంబును నార్యారాలికి నమస్కరించుచున్నది. లోకపాలకులును, సప్తర్షులును, గుసుమ వర్షముల నేవించుచున్నారు.

అరుం—జగద్విభూ ! రామభద్రా !

క. వితతాధ్వరమునఁ గనక
ప్రతికృతికిం బావనాపు బ్రకృతియు నీకున
సీతసహధర్మిణి యగు నీ
పతిఁ గూర్పు ముదార ధర్మ సగణి యులర్పన్. 19.

రామ—భగవతి యాజ్ఞ చొప్పనసే;

లక్ష్మ—కృతార్థుఁడ నైతి.

సీత—బ్రతికితిని.

లక్ష్మ—ఆర్యారాలా ! తత్రిపా హీనుఁ డగు లక్ష్మణుం డిదే నమస్కరించు చున్నాఁడు.

సీత—వత్సా ! ఈశ్వరుండవై దీర్ఘాయుష్మంతుఁడవుకమ్ము.

అరుం—మహాత్మా ! ప్రాచేతసా ! జానకి గర్భ సంభవులును, రామభద్రకుమారులు నగు గుశలవుల దరిఁజేర్పుము.

(నిష్క్రమించును)

రామ—లక్ష్మ—సంతోషము ! అదియట్లే.

సీత—(కన్నీళ్లతో సాకూతముగా) ఎక్కడ నాకుమారులు ?

(పిదప వాల్మీకియుఁ గుశలవులుం బ్రవేశింతురు)

వాల్మీ—వత్సలారా ! కుశలవులారా ! ఇదే ! రఘునాథుఁడు మీ జనకుఁడు. లక్ష్మణుఁడు గనిష్ఠజనకుఁడు. సీతాసతి జననీ. ఇదే ! జనకరాజర్షి మాతామహుఁడు.

సీత—(హర్షకరుణాద్భుతములతోఁ బరికించి) ఏమి ? తండ్రియా ?

కుశ—లవ—హా ! తండ్రీ ! హా! జననీ ! హా ! మాతామహా !

రామ—(సంతోషముతోఁ గౌఁగిలించుకొని) ఓవత్సలారా! సుకృతములచే లభించితిరి.

సీత—రమ్ము కుశకుమార ! రమ్ము లవకుమార ! పునర్జీవిత యగు జననిని చిరకాలము నకుఁ గౌఁగిలించుకొనుఁడు.

కుశ—లవ—(అట్లు చేసి) ధన్యుల మైతిమి.

సీత—మహాత్మా ! నమస్కారము.

వాల్మీ—వత్సా ! యిట్లే చిరకాల ముండుము.

సీత—ఓహో ! తండ్రియుం గులగురుఁడు నార్యాజనయును గౌతమునితో నార్య యగు శాంతాదేవియు లక్ష్మణునితో నుపసన్నుఁ డగు మహనీయుఁ డార్య పుత్త్రుఁడుం గుశలవులు నొక్కమారు సాక్షాత్కరించుటం జేసి పరమానంద పరిపూర్ణనైతిని.

(తెరలోఁ గలకలము)

వాల్మీ—(లేచి చూచి) లవణాసురోన్మూలనుం డగు మధురేశ్వరుం డరుదెంచె.

లక్ష్మ—భద్రములు సానుబంధములు.

రామ—ఈ సర్వము ననుభవించుచున్నను నమ్మఁ జాల కుంటిని. లేదా ? అభ్యుదయముల కిదే స్వభావము.

వాల్మీ—నీ కింక నేమి ప్రియ మొనఁగుదును ?

రామ—ఇంతకిన్నఁ బ్రియము గలదా ? ఐన నిట్లగుఁ గాక !

చ. సురనదినా, జగజ్జననిఁ జొప్పన, భద్రమనోజ్ఞమైన యీ
చరిత మఘాను శుద్ధి నిడి సర్వశుభంబు లొసంగుఁ గాక ! న
శ్వర బరికించుఁ గాక ! బుధవర్గము పూపక రూప మైన ని
ర్భర బహు శబ్దవేది ప్రతిభానిధి యాదికవీంద్రు భారతిన్. 20.

(అందఱు నిష్క్రమింతురు.)

సమ్మేళన మను సప్తమాంకముతో

సర్వము సంపూర్ణము.

